1097

TPLE101B252

TPLA120B1147

పశువైద్య గ్రంథమాల 15 వ పుష్పము

# పశుచికిత్సాసారము

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సాలయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలప్రిన్సిపాల్ నగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,

A. V. L. M. & S., A. M. B. & B.S.

అంగలూరు, కృష్ణాజిల్లా.



1937

సర్వస్వామ్యసంకలితము] [వెల రు 1-0-0.



గ్రంథకర్త:
"అభినవసహదేవ"
మేజర్ శ్రీ రాములుచౌదరి

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములక్రిందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నపుడప్పుడు పశువైద్య గ్రంథముల బ్రకటించుచు వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి తామెల్లరకును దెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రముల మూలకముగను ఆంధ్రదేశమందంతటను ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నేనిప్పుడొక ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రభుత్వమువారివలన ద్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థులకును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రంథములను మాపశువైద్య గ్రంథమాలతరఫున బ్రకటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రంథమాలయందు వెల్వడిన గ్రంథరాజములందిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్లరకును హస్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటరినరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో పీఠిక వ్రాసి వన్నె దెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును త్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథ రచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.



# పశు చికిత్సా సారము

## పెద్ద రోగము (చీడపార్లు) (Renderpest)

1 దిరిసెనచెక్కరసము అర్ధశేరు, నరమూత్రము అర్ధశేరు కలిపి పెట్టుము.

2 మోదుగపువ్వు 2 తు జొన్నకలి అర్ధశేరు ఉప్పు 1 తు కలిపి త్రాగించ వలెను.

3 వ్యాధిముదిరి బాధ పడుచున్నపుడు పచ్చి పందిపెంట రసము సేరు, మిరియాలు 1 తు కలిపి కాచి ఒకపర్యాయము పెట్టుము.

4 వెల్లుల్లి పాయలు 2 తు వాము 2 తు ఉప్పు 3 తు చింతపండుపులుసు అర్ధశేరు కలిపి త్రాగించ వలెను.

5 జిల్లేడాకురసము 2 తు వెల్లుల్లిపాయలు 2 తు ధనియాలు 2 తు ఆరుదొండవేళ్లు 3 తు ఉప్పు 2 తు జొన్నకలి అర్ధశేరు కలిపి త్రాగించుము.

6 బ్రహ్మజెముడు కాల్చి మసిచేసినపొడి 2 తు ఆవపిండి 1 తు మిరెపకాయలపొడి 1 తు పిప్పళ్ళు 1 తు పసుపు ½ తు మోదుగ పువ్వు 1 తు. కలిపి త్రాగించవలెను.

7 ఆవపిండి 1 తు ఉప్పు చేరెడు చింతపండుపులును అర్ధశేరు వాముసరసము అర్ధశేరు కలిపి త్రాగించుము.

8 వేపాకు 2 గుప్పెళ్లు, సైంధవ లవణము 1 తు ||మాని పసుపు 1 తు నిమ్మకాయ రసము 2 తు కలిపి త్రాగించవలెను.

9 పందికొక్కు రక్తము క్రొవ్వు మాంసము తొక్కి కాచి దినమునకు మూడు పర్యాయములు పెట్టవలెను.

10 నాగజెముడును ముండ్లుతీసి ముక్కలుగా కోసినవి మూడు గుప్పెళ్లు, శొంటి, పిప్పళ్లు, మిరియాలు, తాడికాయలు, కరక్కాయలు, ఉసిరికపప్పు ఒక్కొక్కటి అరతులము వంతు నను, జొన్నకలి అర్ధసేరు చింతపండుపులుసు అర్ధసేరు, వాముసము అర్ధశేరు కలిపి త్రాగించవలెను.

11 నువ్వులనూనె అర్ధశేరు, ఇప్పపువ్వు 2 తు కలిపి త్రాగించవలెను.

12 తవాక్షురి 2 తు, వెదురాకు 2 గుప్పెళ్లు, శొంటి 2 తు, దానిమ్మచిగుళ్లు గుప్పెడు, పెరుగు సేరు కలిపి త్రాగించవలెను.

13 వెదురాకు, నేలవేము, అడ్డసరపువేళ్లు, నల్లేరువేళ్ళు, తెల్లావాలు, ఉప్పు సమానభాగములుగా జేర్చి కలితో మూడు గోట్టములు పెట్టవలెను.

14 ఎలుగుబంటి నెత్తురు, పందినెత్తురు కలిపి పెట్టుము.

15 చేదుబీరాకు, మిరియాలు నూరి కలితో పెట్టవలెను.

16 దేవదారుచెక్క, మంచినూనె, ఆవనూనె, మోదుగపువ్వు సమానభాగములు కాచి మూడుగోట్టములు పెట్టవలెను.

17 తాటికల్లు, నూనె కలిపి పెట్టుము.

18 అడవిగుమ్ముడుచెక్క, మిరియాలు, ఉప్పు, కలి నీరు కలిపి పూటకు మూడుగొట్టముల వంతున పెట్టవలెను.

19 శొంటి, వాము, నానువారిపాలు, మోదుగపువ్వు సమాన భాగములు తీసికొని కలితో పెట్టవలెను.

20 సీమసున్నము 2½ తు, కవిరి 2½ తు, మాచికాయ 1 తు, కలినీరు సేరు కలిపి త్రాగించుము.

## —♦ దొమ్మలు (Anthrax) ♦—

1 కరక్కాయలు, ఉసరికపప్పు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, ఒక్కొకటి 2తులములపొడిని తీసికొని సేరు చింత పండురసములోగాని, గేదెపేడరసములోగాని కలిపి కాచి వడ పోసి త్రాగించవలెను.

2 ఎలుగుబంటిరక్తము 1½ తు ఉప్పు 2 తు సొంటి 2 తు కరిదూపము 1½ తు అర్ధసేరు మేకపంచితములో కలిపి పెట్టవలెను.

3 సొంటి, పిప్పళ్లు, మిరియాలు 2 తు వంతునను, పసుపు 1 తు దిరిసెనాకుపసరు అర్ధసేరు, మేకపంచితము అర్ధ సేరు కలిపి రెండుగొట్టములవంతున మూడుపర్యాయము లిచ్చిన తగ్గును.

4 వెల్లుల్లిపాయలు 3 తు పసుపు 2 తు ఉప్పు 8 తు తెల్లతుమ్మచెక్కరసము సేరు కలిపి కాచి అర్ధసేరు మేకమూత్ర ములో కలిపి రెండుపర్యాయము లీయవలెను.

5 ఇంగువ 6 తు మాౖనుపసువు 4 తు ఉప్పుచేరెడు, తమలపాకులునూరు నిమ్మకాయంత ఉండలుచేసి జామున కొకటివంతున ఈయవలెను.

6 కరక్కాయలు, తాడికాయలు, ఉసిరికపప్పు సమాన భాగములును, చేకొణితాకుపసరు అర్ధసేరు, మేకపంచితము అర్ధసేరు కలిపి రెండుపర్యాయములు ఈయవలెను.

7 మూడుడాౖముల సారాయిలో 2 తులముల గజ పిప్పళ్లుకలిపి తాగించుము.

8 ఉప్పు 8 తు, వావిలాకుపసరు అర్ధసేరు, మిరియాలు 1 తు కలిపి తాగించుము.

9 ఆవుపంచితము మానెడు, వ్యాధియొక్క ఎక్కువ తక్కువలనుబట్టి సోలెడు పోయుము.

10 సొంటి, పిప్పళ్లు, మిరియాలు, ఉసిరికపప్పు సమాన భాగములును, వెల్లుల్లిపాయలు 4 తు కారము 4 తు ములగ చెక్కరసము సేరు కలిపి నాలిదొమ్మకు పెట్టిన తగ్గును.

11 కొరగంజిలో పసువు మిరియాలు నేలవేముకలిపి గడియ కొకగొట్టమువంతున పెట్టవలెను.

12 నేరేడుఆకుపసరులో ఉప్పుకలిపి పెట్టుము.

13 వావిలాకుపసరుగాని బండేడు ఆకుపసరుగాని పెట్టవలెను.

14 కరిదూపము, రాతిసున్నము కలితో కలిపి మూడు గొట్టములు పెట్టిన నెరెడిదొమ్మ తగ్గును.

15 దిరిసెనచెక్కరసము, ఆవుపాలు, జొన్నకలి ఉదయ సాయంకాలములందు పూటకు గొట్టమువంతున పెట్టిన తగ్గును.

—♦ నెరెడిదొమ్మ (Anthrax) ♦—

1 ప్రిక్కటెముకలు గొడ్డలిచే బాగుగా కొట్టినతగ్గును.

2 కొర్రపిండి మెత్తగానూరి కరిదూపము నువ్వుల నూనె కలిపి ముక్కులలో పిండి తరువాత వెదురాకుపసరు దిన మునకు మూడుగొట్టములు పెట్టిన తగ్గును.

3 కరిదూపము 1 తులము, రాతిసున్నం 1½ తు, సేరున్నర కలితో కలిపి పెట్టుము.

4 దిరిసెన చెక్కరసము, ఆవుపాలు, జొన్నకలి సమాన భాగములుగా కలిపి ఉదయ సాయంకాలములందు పెట్టవలెను.

5 వాము 4 తు, కరిదూపము 1 తు, ఆముదపువేళ్ల చెక్కరసం అర్ధసేరు కలి సేరు కలిపి త్రాగించవలెను.

6 పులుకలి సేరు, పాలు అర్ధసేరు, ఉప్పు గిద్దెడు, కరి దూపము అరతులం కలిపి పూటకు మూడుగొట్టములు పెట్టుము.

7 బ్రహ్మజెముడుకాల్చినమసి గుప్పెడు కొర్రపిండి 3 గుప్పెళ్ళు పాలు అర్ధసేరు కలిపి పూటకు మూడుగొట్టములు పెట్టుము.

8 తమలపాకులు పూటకు నూరువంతున తినిపించిన తగ్గును.

9 దిరిసెనపాకు పసరు సేరు, జొన్నకలి సేరు, ఆవుపాలు అర్ధసేరు త్రిఫలముల చూర్ణము 3 తులములు కలిపి పూటకు రెండు గొట్టములు పెట్టవలెను.

10 ఆముదపుపప్పు, వాము, వావింటవేళ్ళు, జిల్లేడు పువ్వులు, సున్నము, కరిదూపము, గుంటకలగరఆకు, వెల్లుల్లి పాయలు, ఆవాలు, వేపవిత్తులు, తక్కెడువేళ్లు, మోడి, పిప్పళ్ళు, మిరియాలు, శొంటి, ఇంగువ సమానభాగములుగా రోటమర్దించి కోడిగుడ్డంత మాత్రలుచేసి పూటకొకటి వంతున ముప్పది పూటలుపెట్టిన తగ్గును.

11 దిరిసెనచెక్కపొడి, నేలవేము, తురకవేప, బ్రహ్మదండి వేళ్లు, నూరిగాని, కషాయము కాచిగాని త్రాగించవలెను.

12 నేరేడుచెక్కరసము సేరు, సున్నము 2 తు, కరిదూపము 1 తు, కలి సేరు కలిపి త్రాగించవలెను.

13 ఉలవపిండి, తాటిబెల్లము సమాన భాగములు కలిపి పెట్టిన తగ్గును.

14 వెదురాకు, దిరిసెనవేళ్ళచెక్క, నేలవేము, త్రికటుకములు, వావింటచెట్టుసమూలం కషాయము పెట్టి పూటకు మూడు గొట్టములుపెట్టిన తగ్గును.

## వాతములు (Rheumation)

1 దుష్టుపాకుపసరు సోలెడు, కలినీరుసేరు కలిపి పెట్టవలెను.

2 వెంపలివేళ్ల రసము కలనీరు కలిపి పదిదినములు పెట్టిన తగ్గును.

3 వాతముచే కాళ్ళు వాచియున్నయెడల వావిలి, తంగేడు, బారిజ, దిరిసెన, నింబ ఆకులపసర్లును, నేయిమా•నెడు

ఆముదమునూనె మానెడు కలిపి కాచి సగము శరీరమునకు రుద్ది తక్కినది లోపలికిత్రాగించినయెడల వాతముతగ్గి వాపులు పోవును.

4 తమలపాకులు 100, ఇంగువ 1 తు, కలిపి దినమున కొక పర్యాయము వంతున పెట్టవలెను.

5 పసుపును కలితో కలిపి పెట్టిన తగ్గును.

6 నల్లేరు, ఇంగువ, వెల్లుల్లిపాయలు, ఆముదపు వేళ్ళ చెక్క కలిపి కలితో పెట్టిన ఎటువంటి వాతములైనను హరించును.

7 వావిలి, తక్కేడు, దుష్టుపాకు, దిరిసెనవేళ్ళు, తెల్ల బొరిజచెక్క, తమలపాకులు, మోడి, ఇంగువ, తంగేడు, జిల్లేడుపువ్వులు, గన్నేరువేళ్ళు, నల్లేరు, వాము, చేకొణితివేళ్ళు, కాకరాకు సమానభాగములు రోటిలోవేసి దంచి ముద్దలుచేసి ఆముదముతో కలిపి పెట్టిన తగ్గును.

8 చేకొణితి ఆకురసము, పసుపు, ఇంగువ, వెల్లుల్లి, ఆముదము కలిపి పూట కొక గొట్టము వంతున పెట్టిన తగ్గును.

9 పరి త్రియాకురసము, పుచ్చాకురసము, వావిలాకు రసము, అడ్డసరపాకురసము, సంపెంగాకురసము, తక్కెడాకు రసము, చింతాకురసము, పల్లేరురసము, తురకవేపాకురసము, దిరిసెనాకురసము, మారేడుపండ్ల ఊట, మేడిచెక్కరసము, నూనె, ఆముదము సమానముగ తీసి మిరియాలపొడి కలిపి పాకముగాచేసి పూటకు పావుసేరు పెట్టిన ఎటువంటి వాతములైనను తగ్గును.

## —♦ జంబుకవాతము ♦—

1 పసుపు 6 తులములు, తామరదుంప 1 వీసె, బెండవేళ్లు 2 గుప్పెళ్లు, పంచదార అరవీసెకలిపి 2 సేర్ల పందినేతితో పాకముగావండి వెలగకాయంత తీసికొని అర్ధశేరు గొఱ్ఱె పాలలోకలిపి 15 దినములుపెట్టుము.

2 నిమ్మకాయంత రాతిసున్నము, పిప్పళ్లు 1 తులము కలిపి ఉదయసాయంకాలములయందు 10 దినములుపెట్టుము.

3 పసుపు 1 తులము, శొంఠి 2 తులములు, నీరుల్లిపాయలు 5, పులుసుజ్జిగ అర్ధశేరు కలిపి త్రాగించుము.

4 నాగులాకు 4 వీసెలు, తక్కెడాకు 2 వీసెలు, గోంగూర 3 వీసెలు, మంచినూనె 1 వీసెడు కలిపి ముద్దజేసి రేపూమాపూ మందువచ్చువరకు పెట్టుము.

5 పచ్చిగోంగూర మణుగు, శొంఠి 10 తులములు, మిరియాలు 6 తులములు, ఉసిరికపప్పు 7 తులములు కలిపి త్రొక్కి ఒక బానలోవేసి పెంటపోగుగోతిలోవేసి కప్పియుంచి వారముదినములైన తర్వాత తీసి దినమున కొకవెలగకాయ యంత ముద్దజేసిపెట్టిన తగ్గును.

6 కలబందగుజ్జు అర్ధశేరునవటాకు, ఉలవపిండి అర సోలెడు, నీరుల్లిపాయలు నవాశేరు, కలిపి త్రొక్కి వారము దినములు పెట్టుము.

7 తంగేడుచిగుళ్లు 2 గుప్పెళ్లు, నేగుర్తాకు గుప్పెడు, నీరుల్లిపాయలు 6, గోంగూర 3 గుప్పెళ్లు, పందినెత్తురు అర్ధశేరుకలిపి పెట్టుము.

8 నేలతంగేడుఆకుపసరు అర్ధశేరు, పసుపు 1 తులము, పులుకలి అర్ధశేరు కలిపి త్రాగించవలెను.

## తీట వాతము

1 కలిసీరు అర్ధశేరు బూరుగబంక 4 తులములు నువ్వుపువ్వులు నాలుగుగుప్పెళ్లు కలిపి పెట్టుము.

2 కలిసీరు అర్ధశేరు ఉప్పు చేరెడు వెంపలి ఆకు పసరు అర్ధశేరు కలిపి పెట్టిన తగ్గును.

3 రాతి సున్నము 4 తులములు అరటిఆకులమసి 2 తులములు మోదుగాకు మసి 2½ తులములు మైలతుత్తము 1 తులము కాజాకుపసరు పావుశేరు ఆముదము పావుశేరు కలిపి నాలుగైదు పూటలు పెట్టుము.

4 గాడిదగడపాకుపసరు అర్ధశేరు రాతిసున్నము గుప్పెడు నువ్వులనూనె పావుశేరు కలిపి రాయుడు.

5 మూరొట్టుండాకుపసరు పావుశేరు గంధకము 1 తులము కలిపి రాయుము.

6 గోరింటాకుపసరు పావుశేరు పటిక పొడి 1 తులము పొగాకు రసము పావుశేరు కలిపి రాయుము.

7 కొబ్బరిచిప్పలు కాల్చి మసిజేసి ఆముదములో కలిపి రాయుడు.

8 ఆవాలు ½ తులము శొంఠి ½ తులము హారతికర్పూరము ½ తులము గొలిమిడాకుపసరుతో కలిపి చెవిలో పోయుము.

షరా :— వాతరోగములు వాని రోగనిదానములు చికిత్సలు వాతలు విపులముగా తెలసికొనవలెననిన, నాచే రచింపబడిన అనుభవ పశువైద్య చింతామణి చూడుము.

## —♦ జ్వరము (Fever) ♦—

1 దుష్టుపుతీగె పలుపువలెచుట్టి మెడలోవేయుము.

2 సారాయి 2 డ్రాములు, దుష్టుపాకుపసరు పావుసేరు కలిపి త్రాగించుము.

3 అర్ధసేరు మేకపాలలో పసుపు 1 తులము కలిపి త్రాగించుము.

4 అర్ధసేరు తిప్పతీగెరసములో పావుసేరు వాముసరము కలిపి త్రాగించుము.

5 నువ్వులనూనె తిప్పతీగెరసము సమానభాగములు కలిపి శరీరమునకు రుద్దుము.

6 ఖర్జూరకాయలు నీటిలో నానవేసి అప్పుడపుడు త్రాగించుచుండుము.

7 తిప్పతీగెరసము లోపలికి త్రాగించి తీగెను పలుపుగాచుట్టి మెడలోవేసి, ఆకురసము నూనెలోకలిపి కాళ్లకు రాయుము.

8 దుష్టుపాకు మిరియాలు కలిపి రసముతీసి ముక్కురంధ్రములలో పోయుము.

9 దుష్టుపాకుపసరు పూట కొకగొట్టముపెట్టి బూడిదగాని విభూతిగాని రుద్దుము.

## —♦ గాళ్లు (Foot and mouth disease) ♦—

1 గాలికుంటుతగిలినపశువు ముక్కురంధ్రములో జిల్లేడు చిగుళ్లు నూరిపెట్టుము.

2 సూరేకారము 1 తు, మజ్జిగ అర్ధశేరు కలిపి రెండు దినములు త్రాగించుము.

3 వండిన పెసరపప్పు అర్ధశేరు, వేలపిండి రెండు గుప్పెళ్లు, నెయ్యి పావుశేరు కలిపి త్రాగించుము.

4 చోడిజావ అర్ధశేరు, మజ్జిగ అర్ధశేరుకలిపి త్రాగించుము.

5 రావిచెక్క, తుమ్మచెక్క కషాయము నోటిపుండ్లకు పట్టించుచుండుము.

6 నీరుల్లిపాయలు 5, పసుపు 1 తులం, పెసరపప్పు వుడికించినది అర్ధశేరు కలిపి తినిపించుము.

7 జిల్లేడుకొనలు ముక్కురంధ్రములలో అప్పుడప్పుడు పెట్టుము.

8 జొన్న పెసలు పులగముగావండి నూనెలోకలిపి పెట్టుము. పురుగులు పడిన పుండ్లకు నేయిరాచిన తగ్గును.

9 పెసరపప్పు వేలపిండి నూనె కలిపి పూట కొకముద్ద పెట్టుము.

10 పెసరకట్టు, గానుగపిండి కలిపి పెట్టుము.

11 తమిదెజావలో నూనెకలిపి పెట్టుచు పుండ్లకు నీరుల్లి రసము రాయుము.

12 నీరుల్లిపాయలు, జొన్నఅన్నము పెసరపప్పు వనుపు కలిపి పెట్టుము.

—♦ నాలుకకు సంభవించు వ్యాధులు ♦—

1 నాలుక వాపునకు, పూతకు తురక వేప బెరడు నూరి సమానముగ కవిరి కలిపి నాలుకకు అప్పుడప్పుడు రాయుచుండుము.

2 కవిరి, సూరేకారము నూరి పట్టించుము.

3 పటిక, మాచికాయ నూరి పట్టించుము.

4 రేలఆకుపసరును రాయుము.

5 తుమ్మచిగుళ్ళు, కవిరి కలిపిరాయుము.

6 వెలిగారమును తేనెతో కలిపి రాయుము.

—♦ కడుపు నొప్పి (Colic) ♦—

1 వాముసరసము అర్థశేరు ఉప్పు చేరెడు కలిపి త్రాగించుము.

2 చేరెడుఉప్పు సేరు గోరువెచ్చనినీటిలో కలిపి పెట్టుము.

3 గచ్చాకురసము అర్థశేరు బియ్యపుకలి అర్థశేరు కలిపి త్రాగించుము.

4 నొప్పిచే బాగుగా తన్నుకొను పశువునకు చిరినెల్లి చెట్టువేరురసముగాని గాడిదగడపాకుపసరుగాని అర్థశేరు, సారాయి 2 డ్రాములు కలిపి త్రాగించుము.

5 కురాసానివాము 3 తు కలిసీరు అర్థశేరు కలిపి త్రాగించవలెను.

6 ఇంగువ 2 తు, గచ్చాకురసము అర్ధశేరు ఉప్పు 3తు కలిపి త్రాగించుము.

7 వెల్లుల్లి పాయలు 4 తు గచ్చాకురసము పావుశేరు వాము 6 తు కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించవలెను.

8 ధనియాలరసము అర్ధసేరు ఆముదము అర్ధసేరు కలిపి త్రాగించ వలెను.

9 పొట్టపైన మూడు పర్యాయములు రోకలితో తోమిన తగ్గును.

## కడుపుబ్బు (Tympanites)

1. కాల్చినమసి 12 తు, సేరు కలినీటిలో కలిపి త్రాగించుము.

2. వేకువజామున వేసిన పశ్వులరెట్ట 6 తు, సేరు నీటిలో కలిపి త్రాగించుము.

3. వాముురసము సేరు, ఉప్పుచేరెడు కలిపి త్రాగించుము.

4. దిరిసెనాకుపసరు అర్ధసేరు, ఉప్పుచేరెడు, బియ్యపు కలి అర్ధసేరు కలిపి త్రాగించుము.

5. సైంధవలవణము 4 తు, వస 2 తు, కోస్టు 4 తు, వెఱ్ఱిపుచ్చచెక్కరసము 6 తు కలిపి త్రొక్కి ఆముదముతో తడిచేసి తినుపించుము.

6. పచ్చినేలవేముఆకుపసరు పావుసేరు, ఉప్పుచేరెడు, కలినీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

7. కారింగువ 2 తు, కరిదూపము 1 తు, గచ్చాకు

రసము పావుసేరు, ఉప్పు 4 తు, కలినీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

8. ఇంగువ 3 తు, వెల్లుల్లిపాయలు 4 తు, మంచిబెల్లం అర్ధసేరు కలిపి త్రాగించుము.

9. ఊరపందిపెంటను నీటిలో కలిపి నూడుగొట్టములు పెట్టుము.

10. నేలవేముపసరులో ఉప్పు, కలినీరు కలిపిపెట్టుము.

—♦ రక్తవిరేచనములు, విరేచనములు ♦—

1 కర్పూరము ½ తు, ఇంగువ 1 తు, సొంటి ½ తు బెల్లము తగినంత కలిపి నూకలజావతో రెండు పర్యాయము లిచ్చిన తగ్గును.

2 కవిరి 1 తు, సీమసున్నము 2½ తు, దాల్చినచెక్కపొడి ½ తు, సొంటి ½ తు కలిపి తినుఆహారముతో రెండువేళల పెట్టిన తగ్గును.

3 కవిరి 1 తు, మాచికాయపొడి 1½ తు, నల్లమందు ¼ తు, సోపు 2¼ తు రెండువేళల గంజిలోకలిపి పెట్టవలెను.

4 దాల్చినచెక్కపొడి 1 తు, కవిరి 1 తు, మాచికాయపొడి 1 తు కలిపి తినుఆహారములో కలిపి పెట్టుము.

5 అన్నభేది అర తు, నల్లమందు ¼ తు, కవిరి 1 తు, దాచ్చినచెక్కపొడి 1 తు కలిపి సేరుగంజితో కలిపి ఈయవలెను.

6 ఉడుకబెట్టిన నీరుల్లిపాయలు 10 తు, కవిరి 1 తు, నల్లమందు ½ తు కలిపి గంజితో ఈయవలెను.

7 నల్లమందు ¼ తు, కవిరి 1 తు, సీమసున్నము 2½తు సొంటి 1 తు కలిపి గంజిలో రెండువేళల ఈయవలెను.

8 అవిసెనూనె అర్ధసేరు నల్లమందు ½ తు కలిపి ఈయుము.

9 మారేడు గుజ్జులో కవిరి రెండుమూడుపర్యాయము లీయుము.

## మలబద్ధకము

1 ముసాంబ్రిము ½ తు, నేలవేము 1 తు, ఉప్పు 2½ తు, సొంటి ½ తు, బెల్లము తగినంత కలిపి ఈయవలెను.

2 కటకరోహిణి ¾ తు, ఉప్పు 2½ తు, సొంటి ¼ తు, మిరియాలు ½ తు, సారాయి 10 తు, నూకలజావసేరు కలిపి త్రాగించుము.

3 మోదుగవిత్తులు 1 తు, అన్నభేది 1 తు, విషముష్టి గింజలపొడి ¼ తు కలిపి తినునాహారములో పెట్టుము.

4 కారపుపాలు సేరువంతున రెండు పర్యాయములు త్రాగించుము.

5 ఉప్పు చేరెడు, మోదుగవిత్తులు 1 తు గోరువెచ్చని నీరు సేరు కలిపి త్రాగించవలెను.

## పార్శ్వపువాతము

1 సొంటి, వస, పసుపును ఆవుపాలతో కలిపి ఒకపక్షము దినములు త్రాగించుము.

2 ఆవాలు, అక్కలకఱ్ఱ సమానభాగములు కలిపి అప్పుడప్పుడు నాలుకకు తేనెతో రాయుము.

3 మిరియాలపొడిని నువ్వులనూనెలో చలనములేని భాగములకు రాయుము.

4 సొంటి సైంధవలవణమును కలిపి నూరి ముక్కులలోనికి నస్యముచేయించుము.

## —♦ అజీర్తి, శూలలు (Indigestion and Colic) ♦—

1 వెల్లుల్లి, ఆవపిండి, ఉప్పు మజ్జిగలో కలిపి పెట్టవలెను.

2 కారపుపాలు మూడుగొట్టములు పెట్టవలెను.

3 కారము, ఆవపిండి, ఉప్పు కలితో కలిపి మూడుగొట్టములు పెట్టుము.

4 బ్రహ్మజెముడు కాల్చి మసిచేసి కారము, ఆవపిండి కలిపి పెట్టుము.

5 వెల్లుల్లిపాయలు, ఆవాలు, కారము కలిలో కలిపి పెట్టుము.

6 పసుపు వేపాకు కారము సైంధవలవణము కలి కలిపి త్రాగించుము.

7 చింతపండుపులుసు, కారము, ఉప్పు, ఆవపిండి కలిపి పూటకు మూడు గొట్టములు పెట్టుము.

8 కరిదూపము; వాము; ఉప్పు; గచ్చపప్పు; ఆవాలు; కలిలోకలిపి పెట్టుము.

9 కాకరాకుపసరు, ఉప్పు, కారము, కలితో మూడు గొట్టములుపెట్టుము.

10 మిరపాకురసము మిరియాలపొడి ఉప్పు నూరి కలితో పెట్టుము.

11 వాము, ఆవాలు, కరిధూపము, ఉప్పు, పంచలవణములు, ఇంగువ, కలిలో కలిపిపెట్టిన శూలలన్నియుపోవును.

12 నరమూత్రము, తురకవేపవిత్తులు, ఉప్పు, పులి కలితో పెట్టుము.

13 మిరపవిత్తులు, వేడినీటిలోకలిపి పెట్టుము.

14 వాకుడుచెట్టు సమూలరసములో పంచలవణములు, వెల్లుల్లి కలిలో కలిపిపెట్టుము.

15 కారము ఉప్పు కలిపిపెట్టుము.

## —♦ బలవర్ధ కౌషధములు (Tonics) ♦—

1 విషముష్టి గింజలపొడి అరతు,అన్నభేది 1తు, నేలవేము 1 తు, ఉప్పు 2½ తు కలిపి తినుఆహారములో రెండువేళల పెట్టుచుండిన మిగుల బలము కలిగించును.

2 మసాంబరము అర తు నవాసాగరము అర తు సూరేకారము ¼ తు గంధకము అర తు బెల్లము తగినంత కలిపి రెండువేళల ఈయవలెను.

3 శంఖుపాషాణము 2 వడ్లగింజలఎత్తు అన్నభేది ½ తు సోడా ఉప్పు 1 తు సోపు 2½ తు కలిపి ఈయవలెను.

4 మహిసాక్షి 1తు కటకరోహిణి 1 తు సొంటి 1 తు ఉప్పు 2½ తు కలిపి తినుఆహారములో పెట్టవలెను.

5 లవంగాలు 1 తు సొంటి 1 తు నేలవేము 1½తు సోడాఉప్పు 2 తు కలిపి ఆహారములో ఈయుము.

6 మునగచెక్క పొడి 1 తు సొంటి అర తు ఉప్పు 1½తు మిరియాలు ½ తు జీలకర్ర 1 తు కలిపి దాణాగా ఈయుము.

7 జిల్లేడు చెక్కపొడి 1 తు విషముష్టి ¼ తు గంధకము ¼ తు సూరేకారము 1 తు కలిపి ఈయవలెను.

8 నల్లఉప్పు అర్ధసేరు గంధకము ½ సేరుసొంటిపొడి అర్ధసేరు నేలవేము అర్ధసేరు కర్పూరము పావుసేరు ఆవాల పొడి అర్ధసేరు మెంతులుపొడి అర్ధసేరు పసుపు అర్ధసేరు కలిపి పొడి చేసి యుంచుకొని ఉదయ సాయంకాలములందు అర్ధచటాకు వంతున యిచ్చిన మంచిది.

9 సోపు 2½ తు సొంటి 1½ తు నేలవేము 1½ తు బెల్లముతగినంత కలిపి ఈయుము.

10 చిత్రమూలము ½ తు వేపచెక్క 1 తు జిల్లేడు వేరు ½ తు కారుమునగ ½ తు నేలవేము ¾ తు వాటిని మెత్తగానూరి సేరు మజ్జిగలో కలిపి దినమునకొకసారి వారము దినములు త్రాగించుము.

11 దుక్కిదున్ను పశువు చిక్కి నల్లకప్పువేసినయెడల తెలికపిండి అరవీసె వరిఅన్నము సోలెడు కలిపి దినమున కొక పర్యాయము వంతున 15 దినములు పెట్టుము. యీ మోతాదు కంటె ఎక్కువ పెట్టిన వగర్పు పుట్టును.

12 ఉలవలుగాని సెనగలుగాని ఉదయిమున నానవేసి సాయంత్రము వడపోసి జల్లిబుట్టలోవేసి మరునాటి సాయంకాలమునకు మొక్క మొలిచిన తర్వాత కొద్దిగా దంచి వాటిలో 1 తు ఉప్పు పదిగింజలు చిట్టాముదపుపప్పు కలిపి ప్రతిదినము సాయంకాలము 25 దినములు పెట్టిన పశువు బాగుపడును.

13 నిశ్శక్తివలన యెంతఆహారము పెట్టినను బలియక బక్కచిక్కి యుండు పశువులకు ప్రతిదినము మానెడు సెనగ పప్పు నానబోసి మరుసటిదినము తీసి ఒ తు ఉప్పు కలిపి సాయంకాలపు పూట 40 దినములు పెట్టిన బాగుగా బలియును.

14 వాతశరీరము కలిగి నునుపుగను బలిసినదిగను, డొక్కలుడించుకొని ఎల్లపుడు కన్నులవెంట నీరుగార్చుచు కాళ్లు పట్టివేయు ఎద్దులకు కల్లుబెల్లం వీసెడు మంచినువ్వులనూనె ½ వీసెడుకలిపి జత యెద్దులకు వుదయము 10 గంటలకు పెట్టవలెను. యీరీతిగా అయిదు వారములు పెట్టుచు పిల్లిపెసర తాండంగి మినపకాడ ప్రత్తివిత్తులు మొదలగునవి నిరాటంకముగా పెట్టవచును.

15 అంతనిశ్శక్తి అంతవాతము లేకుండనుండు పశువునకు నిశ్శక్తివస్తువు లుపయోగించినప్పుడు నీరు మేత ఎక్కువగా సేవించుచు, తెల్లవారునప్పటికి నిర్జీవముగలదిగా నుండి నిస్సత్తువతో నుండును. అప్పుడు యిత్తడికాగునకు కళాయి వేయించి అందులో మెట్టతమిదలు వేయించి అందులో మెట్టతమెదలు ఒకఇరస కల్లుబెల్లం 1 ½ మణుగు, మంచినూనె 1 ½ మణుగు వేసికలిపి ఒకవారము నిలువయుంచి ప్రతిదినము అరవీసె పరిమాణమువంతున పైనచెప్పిన లక్షణములుగల ఎద్దునకు పెట్టినయెడల బాగుగా బలియును.

16 రత్నపురిగుగ్గిలము వీసెడు మంచినూనె వీసెడు తాటిబెల్లం వీసెడు గవ్వసాంబ్రాణి వీసెడు తెచ్చి ముందు నూనెలో గుగ్గిలపుపొడి కొద్దికొద్దిగా కలుపుచుండవలెను. లేని

మొదల గడ్డకట్టును. అందులో తాటిబెల్లము కలిపి తరువాత సాంబ్రాణి కలిపి డబ్బాలో వారముదినము లుంచి తదుపరి వారముదినములు ఈ మందును జత యెద్దులకు పెట్టవలెను. పై మందులో శేరుగాని అద్దెడుగాని మినపపిండి కలిపిపెట్టిన మిగులమంచిది.

## —♦ గుఱ్ఱపుమసాలా ♦—

| | |
|---|---|
| సొంటి | బిడాలవణము |
| పిప్పళ్ళు | ఇందుపకాయలు |
| మిరియాలు | కన్నెకోమలి |
| వస | మానుపసుపు |
| మోదుగమాడలు | యాలకులు |
| దాల్చినచెక్క | జాజికాయ |
| సునాముఖి | మారేడుకాయ |
| లవంగాలు | మరాటిమొగ్గలు |
| దుంపరాష్టము | కరక్కాయపువ్వు |
| ఓమము | గాడిదగడపాకు |
| కురంజిఓమము | నల్లజీలకర్ర |
| కురాసానివాము | మోడి |
| గారకాయ | అక్కలకర్ర |
| కరక్కాయబెరడు | సుగంధపాల |
| తాడికాయలు | ఆకుపత్రి |
| ఉసిరికపప్పు | తాళిసపత్రి |
| సైంధవలవణము | కటకరోహిణి |
| సౌవర్చలవణము | కన్నెబూరుగు |

ఈపైవస్తువులను ఒక్కొకటి తులము వంతున జేర్చి పొడిజేసి అందులో తాటిబెల్లము పదలము, దిగువాయినూనె తవ్వెడు, కలిపి దంచి పూటకు చిన్న వెలగకాయంత పెట్టిన దీర్ఘవాతములు హరించును. పశువులకు ఈ మసాలాను అవుసరమున్నపుడు అనగా ఎక్కువ ప్రమాదకరమైన దీర్ఘవ్యాధులకు మాత్రమే వాడవలెను.

—♦ కడుపులోని వాయువును పోగొట్టునవి ♦—

1 సోపు 2 తు ఏలకులు 2 తు జీలకర్ర 1½ తు సొంటి 1½ తు కలిపి తినుఆహారములో కలిపి పెట్టుము.

2 ఇంగువ 2 తు కర్పూరతైలము ¼ తు అవిశనూనె అర్ధసేరు కలిపి త్రాగించుము.

3 సారాయి 10 తు ఉప్పు 10 తు ఇంగువ 1 తు గోరు వెచ్చని నీరు సేరున్నర కలిపి త్రాగించుము.

4 ఏలకులు 2 తు లవంగాలు ½ తు సొంటి 1½ తు సోపు 1 తు జీలకర్ర 1½ తు కలిపి దాణాలో పెట్టుము.

5 దాల్చినచెక్క పొడి 1 తు సొంటి 1½ తు మిరియాలు 1 తు సోపు 1 తు॥ తినుదాణాలో కలిపి పెట్టుము.

6 సేరు కొబ్బరినూనె త్రాగించుము.

7 ధనియాలు 4½ తు సోపు 1½ తు జీలకర్ర 1 తు సొంటి 1 తు వాము గిద్దెడు కలిపి తినుఆహారములో కలిపి పెట్టుము.

8 మెంతులు 3 తు మిరియాలు 1½ తు ఆవాలు 1 తు పసుపు 1 తు ఉప్పు గిద్దెడు కలిపి పెట్టుము.

9 వెల్లుల్లి 4 తు ఇంగువ $1\frac{1}{2}$ తు ఉప్పు $2\frac{1}{2}$ తు సొంటి 1 తు బెల్లపునీటితో కలిపి పెట్టుము.

10 పిప్పళ్లు 1 తు సొంటి 1 తు పసుపు $1\frac{1}{2}$ తు లవంగాలు $\frac{1}{2}$ తు ఉప్పు $2\frac{1}{2}$ తు కలిపి పెట్టుము.

## ఉద్దీపనౌషధములు

1. నాటుసారాయి 10 తు సొంటిపొడి 1 తు నల్లమిరియాలపొడి $\frac{3}{4}$ తు ఒక శేరుజావలో కలిపి త్రాగించవలెను.

2. అన్నభేది 1 తు ఉప్పు రెండున్నర తు పొడిగాచేసి ప్రతిపూట తినిపించవలెను.

## ఉపశాంతికరములు

1. గంజాయిపత్రి 1 తు ఇంగువ 1 తు నాటుసారాయి 10 తు సేరున్నరనీటిలో కలిపి త్రాగించవలెను.

2. కర్పూరతైలము రెండున్నర తు సీమఅవిసెనూనె 10 చటాకులు కలిపి త్రాగించవలెను.

## మూత్రరోగములు

1 నీరుల్లిపాయల రసమును నీరు చురుకునకు యిచ్చిన తగ్గును.

2 సూర్యక్షారమును నీటిలో కలిపియిచ్చిన నీరుచురుకు తగ్గును.

3 పెద్దపల్లేరు సమూలరసమును యిచ్చిన మూత్రకోశములోని నొప్పి, మంట, వేడి, శుక్లనష్టము తగ్గును.

4 శిలాజిత్తు భస్మమును తేనెతో కలిపియిచ్చిన శిలా మేహవాతము తగ్గును.

5 ధనియాలచూర్ణమునుగాని పచ్చికొత్తిమీర ఆకును గాని యిచ్చిన మూత్రమువెంట ఇంద్రియము పశుదానిని కట్టించును.

6 గోరింతాకురసములో నీరుకలిపి యిచ్చిన శుక్ల నష్టము తగ్గును.

7 మంచిగంధమును లోపలికిచ్చిన వీర్యనష్టముతగ్గును.

8 గజ్జేరాకుల రసమును పాలతోకలిపి త్రాగించుము.

## —♦ దగ్గు (Cough) ♦—

1 నేలవేము కలినీటిలో కలిపి ఉదయసాయంకాలము లందు పెట్టుము.

2 వెంపలివేళ్లరసము కలితో కలిపి ముక్కురంధ్రము లలో పోయుము.

3 తెలికపిండిని మోదుగనీరు కలితో కలిపి పెట్టుము.

4 నేలవేముఆకులు, దుష్టపాకులు, వెంపలి, చిట్టి గారవేళ్లు సమానభాగములు చూర్ణముచేసి నూనెతోవండి పెట్టుము.

5 సొంటి పిప్పళ్లు మిరియాలు సమానభాగములు తీసికొని కలితోపెట్టిన దగ్గువగర్పు కట్టును.

6 దిరిసెనాకుపసరు, తెల్లవావిలాకు పసరు, కలిపి ప్రతిదినము పెట్టుచుండిన నొడల తగ్గును.

7 దిరిసెనాకుపసరు, నరమూత్రము, పసుపు, నల్లేరు రసము కలిపి వరుసగపెట్టిన తగ్గును.

8 చేగొణిశాకుపసరు, పసుపు, పందిరక్తము కలిపి పెట్టుము.

9 వెలిగారము కల్లు పందిరక్తము మిరియాలు కామంచాకుపసరు పసుపు సమానభాగములు కలిపి వారము దినములు పెట్టిన తగ్గును.

10 జొన్నపిండి కల్లు నరమూత్రము పసుపు పిప్పలి మిరియాలు కలిపి పూట కొకగొట్టమువంతున పెట్టిన తగ్గును.

11 వెలగాకురసము నూనె పసుపు కలిపి పూట కొక గొట్టము పెట్టవలెను.

12 నేలవేము కటకరోహిణి నీలివెంపలివేళ్లు జిల్లేడు పువ్వులు పిప్పళ్ళు ఉమ్మెత్తవేళ్లు తాటిబెల్లపుసారములో కలిపి పెట్టుము.

13 ఉలవపులగము తాటిబెల్లము ఊరపందిరక్తము కలిపి పెట్టవలెను.

14 పల్లేరుకాయలరసములో పందిరక్తము కలిపిపెట్ట వలెను.

16 నీరుల్లిపాయలరసము అర్ధశేరు, మజ్జిగ అర్ధసేరు కలిపి త్రాగించుము.

17 రావిచెక్కరసము అర్ధశేరు, పచ్చిపాలు అర్ధసేరు కలిపి నాలుగు దినములు త్రాగించుము.

18 తెలికపిండి అరవీసె, ఆవుపాలు అర్ధశేరు, గంజి అర్ధసేరు కలిపి త్రాగించవలయును.

19 ప్రత్తికాయలు గుప్పెడు ఆవుపాలతో నూరి త్రాగించుము.

20 మూర్కొండాకు పసరు ఒక్కొక్క ముక్కురంధ్రములో 10 చుక్కలు పిండుము.

## —♦ దగ్గు, జలుబు (Bronchitis) ♦—

1 ఇంగువ 6 తు అల్లము 2 తు కలిపి నూరి తినిపించవలెను.

2 నీరుల్లిపాయలు దాహముపెట్టినట్లుగా తినిపించుము.

3 అడ్డసరపాకు రసముతో తేనెకలిపి నాకించుము.

4 ఇంగువ ½ తు నవాసాగరము ½ తు కర్పూరము ½ తు యష్టిమధుకము ¾ తు బెల్లము తగినంత కలిపి నాకించవలెను.

5 కర్పూరము, యష్టిమధుకము 1½ తు ఇంగువ 1 తు తేనె తగినంత కలిపి అప్పుడప్పుడు నాలుకకు నాకించవలెను.

6 కృష్ణతులసిఆకులు అరగుప్పెడు, మిరియాలు ½ తు, సొంటి ½ తు తములపాకులు 6 కలిపి నూరి తేనెతో నాకించుము.

7 పిప్పళ్లు, యష్టిమధుకము, దాల్చినచెక్కపొడి తగినంత తేనెతో కలిపి త్రాగించవలెను.

8 నీరుల్లిపాయలరసము మజ్జిగలోకలిపి త్రాగించుము.

9 కస్తూరి, పిప్పళ్లు, నవాసాగరము తీసికొని తగినంత తేనెతో కలిపి నాకించవలెను.

10 ముద్దకర్పూరమును మంచిబెల్లముతో కలిపి నాకించవలెను.

## —♦ వగర్పు (Hard breathing) ♦—

1 వస, సొంటి, పిప్పళ్లు, పసుపు, మిరియాలు ఒక్కొక్కటి పావుతులమువంతున నూరి ముక్కు రంధ్రములలోనికి నస్యము చేయించుము.

2 అడ్డసరపాకురసము మానెడు, సొంటి 8 తు, పసుపు 3 తు, మిరియాలు 4 తు కలిపి నూరి నాలుగుదినములు త్రాగించుము.

3 కలినీరు పావుశేరు, వెంపలిఆకురసము 3 తు కలిపి ముక్కు రంధ్రములలో పోయుము.

4 మోదుగాకుపసరు అర్ధశేరు, తెలికపిండి సవాశేరు కలిపి త్రాగించుము.

5 పచ్చినేలవేముఆకుపసరు పావుశేరు, వెదురాకు గుప్పెడు, కలినీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

6 మోదుగపువ్వు 2 తు నీరుల్లిపాయలరసము పావుశేరు, మజ్జిగ అర్ధశేరుకలిపి త్రాగించుము.

7 తెలికపిండి సవాశేరు, జొన్నకలి అర్ధశేరు, మోదుగపువ్వు 1 తు కలిపి త్రాగించుము.

8 దిరిసెనాకుపసరు పావుశేరు కల్లుబెల్లం 8 తు కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించుము.

9 దుష్టుపాకు గుప్పెడు, దిరిసెనాకులు గుప్పెడు, పసుపు ½ తు నల్లేరు 3 తు కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించుము.

10 సేగుర్తాకుపసరు అర్ధశేరు, పందిరక్తము పావుసేరు కలిపి త్రాగించుము.

11 కామంచిఆకుపసరు పావుసేరు, పందిరక్తము పావుసేరు, కల్లు అర్ధశేరు, వెలిగారము 1 తు కలిపి వారము దినములు పెట్టవలెను.

12 గచ్చపప్పుపొడిని చెవులలో వేసిన తగ్గును.

13 దుష్టుపాకు పసుపు ఆముదము కలిపి వండిపెట్టిన తగ్గును.

14 అడ్డసరపాకు సొంటి కషాయముగా కాచి పూట కొకగొట్టము వంతున పట్టిన తగ్గును.

15 పెద్దమ్రానుచెక్కరసములో తగినంత మిరియాల పొడి కలిపి పెట్టిన తగ్గును.

## —♦ జ్వరమును తగ్గించునవి (Febrifuges) ♦—

1 వసపొడి 2 ½ తు నేలవేము కషాయము 2½ తు వేడినీరు సేరున్నర కలిపి త్రాగించుము.

2 నవాసాగరము 1 ½ తు ఉప్పు 10 తులములు, నీరు సేరు కలిపి త్రాగించుము.

3 గచ్చపప్పు 1 తు మిరియాలు 1తు లవంగాలు ½ తు కలిపి తినుఆహారములో పెట్టుము.

4 నేలవేము 1 తు సూర్యక్షారము ½ తు గచ్చపప్పు 1 తు మిరియాలు 1 తు తినుఆహారములో కలిపిపెట్టుము.

5 తిప్పతీగెరసము 2½ తు నేలవేమురసము 2½ తు సొంటి 1 తు వేడినీరు సేరు కలిపి త్రాగించవలెను.

6 వేపచెక్కరసము 2½ తు దాల్చినచెక్క 1 తు లవంగాలు ½ తు నీరు సేరు కలిపి త్రాగించవలెను.

7 సూరేకారము ½ తు కర్పూరము ¼ తు నవాసాగరము ½ తు సారాయి 10 తు వేడినీరు సేరు కలిపి త్రాగించుము.

8 చింతపండుపులుసు అర్ధసేరు నీరుసేరు కలిపి త్రాగించవలెను.

9 కర్పూరము 1 తు నవాసాగరము 1 తు నేలవేము 2 తు సొంటి 2 తు సోపు 2 తు సేరు నీటిలో కలిపి త్రాగించవలెను.

## ఆకలిని కలుగజేయునవి (To increase appetite)

1 అల్లము మంచి బెల్లము కలిపి తొక్కి పెట్టుము.

2 వాముర‌సము అర్ధసేరు సొంటి 1 తు మిరియాలు ½ తు కలినీరు సేరు కలిపి త్రాగించవలెను.

3 జిల్లేడుమొగ్గలపొడి ¼ తు వాముపొడి 1 తు మిరియాలపొడి ½ తు కలిపి తినుఆహారములో పెట్టుము.

4 విషముష్టి పొడి ¼ తు ఇంగువ ½ తు నేలవేము 1 తు అన్నభేది 1 తు తినుఆహారములో కలిపి పెట్టుము.

5 నీరుల్లిపాయలరసము మజ్జిగలో కలిపి పెట్టుము.

6 వాము ఉప్పును గుంటకలగరాకురసములో కలిపి యిచ్చిన ఆకలిని పుట్టించును.

—♦ నులిపురుగులు చంపుట (Internal worm-killers) ♦—

1 దుష్టుపాకురసము పావుసేరు త్రాగించుము.
2 గాడిదగడపాకురసము పావుసేరు త్రాగించుము.
3 కుప్పింటాకులో వుప్పుకలిపి పెట్టుము.
4 అరటివేళ్లరసము లోపలికి త్రాగించుము.
5 వేపాకుపసరులో కొద్దిగా ఉప్పుకలిపి పెట్టుము.

—♦ తెలియనిరోగములకు చికిత్సలు ♦—

1 నరమూత్రము అర్ధసేరు, మోదుగపువ్వు 2 తు కలిసీరు అర్ధసేరుకలిపి మూడుదినములు త్రాగించుము.

2 ఎలుగుబంటి రక్తము ½ తు కలిసీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

3 నీరుల్లిపాయలు సవాసేరు, కోడిపెంట 2 తు ఉప్పు చేరెడు నువ్వులనూనె అర్ధసేరు కలిపి త్రాగించుము.

4 కొత్తకుంకుడుకాయలు 3, గొఱ్ఱెచర్మము 3 తు నేలవాము 4 తు సేరు నీటిలోకలిపి త్రాగించుము.

5 చేకొణితాకుపసరు అర్ధసేరు, పసుపు 1 తు నువ్వుల నూనె అర్ధసేరు కలిపి త్రాగించుము.

6 తెలికపిండి అరవీసె, మోదుగపువ్వు 3 తు కలిసీరు అర్ధశేరు కలిపి పెట్టుము.

7 మేకమూత్రము అర్ధసేరు, పసుపు 1 తు దిరిసెనాకు పసరు అర్ధసేరు, సొంటి 1 తు కలిపి త్రాగించుము.

8 నల్లఉప్పివేరు 3 తు మోదుగపువ్వు 3 తు పసుపు 1 తు కొర్రగంజి సేరు కలిపి త్రాగించుము.

9 సైంధవలవణము 1 తు వాముర సము పావుసేరు, మోదుగపువ్వు 2 తు నరమూత్రము అర్ధసేరు కలిపి త్రాగించుము.

10 నువ్వుపిండి సేరు, మోదుగపువ్వు సేరు, కొర్రగంజి లోగాని, కలితోగాని కలిపిపెట్టవలెను.

11 కారుమునగవేరు, కామంచి, జొన్నకలి, కలిపి పెట్టిన తగ్గును.

## —♦ రొమ్మునొప్పి (పట్టు) ♦—

1 తెలకపిండి సవాసేరు పాలు అర్ధసేరు కలిపి పదిదినములు త్రాగించుము.

2 వరిపిండి సవాసేరు ఉలవపిండి అరశేరు తాటిబెల్లము 1 వీ కలిపి త్రొక్కి నిమ్మకాయంతఉండలుచేసి దినమునకు నాలుగుపెట్టుము.

3 మంచినడివయస్సులోనున్న అనగా మొదటి సారి గుడ్లుకొరకు వచ్చిన పెట్టనొకటి, దాల్చినచెక్క 5 తు ఏలక్కాయలు 2 తు లవంగాలు 2 తు దుంపపసుపుకొమ్ములు 5 తు ధనియాలు పావుసేరు అల్లము 5 తు వాము సోలెడు, నువ్వులనూనె అరవీసె తెచ్చి సదరువస్తువులన్నియు మెత్తగా కొట్టవలెను. కోడి బొచ్చుతీసి కాల్చి కాళ్లభాగములు తీసివేసి

మిగిలినది రోటిలోవేసి మెత్తగా త్రొక్కి ఎముకలు తీసి అందు లోపైచూర్ణమును నూనెలోకలిపి మెత్తగా దంచి ముద్దలుచేసి సాయంకాలము పెట్టవలెను. ఈ మందు పెట్టిన తరువాత ఆరాత్రి నీరు పెట్టరాదు-ఇట్లుచేసిన సమస్త వాతరోగములు హరించును. (అనుభవము)

4 ఉడుమును తెచ్చి రోటిలోవేసి దంచి అందులో తెలికపిండి సవాసేరు సొంటి 3 తు పిప్పలి 4 తు మిరియాలు 3 తు కలిపి దంచి కోడిగుడ్డంత ఉండలుచేసి పెట్టుము.

5 తక్కెడువేరుపొట్టు 2 గుప్పెళ్లు జిల్లేడిపువ్వులు గుప్పెడు కల్లుబెల్లం 1 వీసె కలిపి త్రొక్కి నిమ్మకాయంత ఉండలుచేసి పెట్టుము.

6 కోడిగ్రుడ్లు, చేగోణితాకు, వాము, తాటిబెల్లము, మిరియాలు ఆముదము కలిపి మూడు పూటల నిమ్మకాయంత పెట్టుము.

7 కొఱ్ఱపిండి ఉలవపిండి బెల్లము కలిపి పెట్టిన తగ్గును.

8 నువ్వుపిండి, తాటిబెల్లము, ఉలవపిండి, కోడిపెట్ట, కొఱ్ఱవ్వ సమానభాగములు రోట వేసిదంచి కోడిగుడ్డంత రెండు వేళల పెట్టుచుండవలెను.

9 ఉప్పిచెక్క, పసుపు, ఉలవపిండి కలిపిపెట్టిన తగ్గును.

10 తాటిబెల్లము, జిల్లేడుపట్ట కలిపి దంచిపెట్టినతగ్గును.

11 పందినెత్తురు అప్పుడప్పుడు రుద్దుచుండుము.

12 తాటిబెల్లము, పిప్పలిమోడి, మిరియాలు, చిత్రమూలము, కొఱ్ఱలు కలిపి దంచి ఉండలు చేసిపెట్టవలెను.

13 గలిజేరువేళ్లు, తాటిబెల్లము, పావురము రోటను వేసి త్రొక్కి కోడిగుడ్డంత పెట్టవలెను.

14 మేకవెన్నను గురువిందాకుపసరుతో కలిపి రొమ్మునకు మర్దనచేయుము.

15 గేదెపేడ, పసుపు, బ్రహ్మజెముడుపాలతో కలిపి రొమ్మునకు పట్టించవలెను.

## అబ్బుపట్టు

1 పశువు ముక్కుకొననుండి తోకచివరవరకు త్రాడుతో కొలిచి ఆత్రాడును చెరిసగముచేసి ఆసగముతో దాని ముక్కుకొననుండి కొలువగా నది ముగిసెడిచోటునకు వాత వేసిన తగ్గును.

2 దొండాకుపసరు వెన్నతో కలిపి అరుత్రిభాగమునకు మర్దనచేసి తవుడు వేయించి కాపులు కాయుము.

3 పందిచమురు అప్పుడప్పుడు రుద్దుచుండుము.

4 ఆముదముతో దుష్టపాకుపసరు కలిపి రుద్దవలెను.

5 చేకొణితాకురసముతో ఆముదము కలిపి వెన్ను భాగమునకు రుద్దవలెను.

6 ఆరంభములో వెన్నుభాగమును వెన్నతో రుద్ది, చిన్న ఉల్లిపాయలు, జిల్లేడాకులు పొట్లములుకట్టి ఆముదములో ముంచి కాకచేసి వెన్నుభాగమునకు కాపులుతీయవలెను.

7 ఒక చెట్టునకుగట్టి మెడనులాగి కాలితో వెన్ను రుద్దుచు ఆముదము పూయుము.

## —♦ చెవిరోగములు (Ear diseases) ♦—

1 నిమ్మకాయరసము 2 తులములు, గవ్వసున్నము ½ తులము కలిపి చెవిలో పోయుము.

2 ఉత్తరేణి సమూలపుభస్మము కాల్చినపొడి 2 తులములు నూనె 4 తులములు కలిపి పోయుము.

3 కుప్పింటాకుపసరు పదిచుక్కలు పిండుము.

4 ముసాంబరము ½ తులము, పసుపు ½ తులము కలిపి చెవిలో అప్పుడప్పుడు వేయుచుండుము.

5 వావింటాకు ఉప్పుతో దంచి రసముతీసి చెవిలో పోయుము.

6 గవ్వను కాల్చి భస్మముచేసి నిమ్మరసముతో కలిపి వేసిన తగ్గును.

7 ఆముదములో నీరుల్లిపాయలరసం కలిపివేసిన తగ్గును.

8 కుక్కవావింటాకుపసరు నూనెలో కలిపి పోసిన చెవిలోచీము, కురుపులు, పోటు తగ్గును.

9 గంజాయిఆకురసమును చెవిలో పోయుము.

10 పంముజిల్లేడాకులరసము పోసిన చెవిలోనొప్పి, చీము తగ్గును.

11 కాకిదొండాకుపసరు చెవిలో పిండుము.

12 రసకర్పూరమును మంచినూనెలో కలిపి పోయుము.

13 తెల్లబాడితాకురసము చెవిలో పిండుము.

14 రుద్రజడాకు పిండి రసముదీసి గోరువెచ్చగా నున్నప్పుడు చెవిలో వేయుము.

15 నీరుల్లి పాయరసములో కోడిగుడ్డు తెల్లసొన కలిపి చెవిలో పోయుము.

## బొడ్డెరుక

1 ఈవ్యాధి ఆరంభించినవెంటనే కరిధూపము 1 తు సొంటి 2 తు పిప్పళ్ళు 1 తు మిరియాలు 1 తు అనుములు గుప్పెడు చేదుబీరాకుపసరు పావుశేరు నెయ్యి అర్ధశేరుకలిపి త్రాగించుము.

2 రావిచెక్కరసము అర్ధశేరు ఆవుపాలు అర్ధశేరు కలిపి త్రాగించుము.

3 సొంటిగంధము కండ్లలో కలికము వేయుము.

## ఉండె తొలగుట

1 ఆముదపుపప్పు సోలెడు, రాతిసున్నము 15 తులములు తెచ్చి మెత్తగానూరి ఉండెను సరిగాలాగి పట్టువేసి నాలుగు దినములుంచిన తగ్గును.

2 వాపున్నయెడల తంగెడాకు తొక్కి ఆభాగమునకు కట్టుము.

3 ఉండెనులాగి జారిన భాగముచుట్టు రక్షలుపెట్టుము.

4 సొంటి 4 తులములు పిప్పళ్ళు 1 తులము మిరియాలు 1 తులము ఉమ్మెత్తాకుపసరు అర్ధశేరు తేనె 4 తులములు కలిపి మర్దించుము

5 కుందేటినెత్తురు ఉమ్మెత్తాకు పసరు, తేనె కలిపి మర్దనచేయుము.

## —♦ కాలిన బొబ్బలు (Burns) ♦—

1 గాడిదగడపాకురసము రాచి పిడకబూడిద జల్లుము.

2 నవనీతము ఆరగా ఆరగా రాయుచుండుము.

3 తిప్పతీగెరసము పూయుము.

4 గానుగవేరు గంధమును చల్లతో కలిపి రాయుము.

5 వేపవేళ్ళరసము పూయుము.

6 కొబ్బరినూనెలో సున్నపునీరుపోసి తరచిన వెన్నవలె నగును. దీనిని ఆరగా ఆరగా పూయుచుండుము.

7 త్రిఫలచూర్ణము సమానభాగములు తీసికొని నూనెకలిపి రాయుము.

8 పాతసున్నమును పెరుగుమీద తేటకలిపి రాయుము.

9 గోరింతచెక్కకషాయము రాయుము.

10 నీలిమందును నీటిలో కలిపి రాయుము.

## —♦ పురుగులుపడినపుండ్లు ♦—

1 బోరిజపాకుపసరు గుప్పెడు, ఉప్పు 2 తులములు మిరియాలు 1 తులము తెచ్చి గుమ్మపాలతో నూరి పురుగులు పడిన పుండ్లకు పట్టించుము.

2 మిరియాలు 1 తులము సైంధవలవణము 1 తులము గాడిదగడపాకుతో నూరి పుండ్లకు పట్టించుము.

3 ఆముదములో క్రొత్తరాతిసున్నమునూరి పుండ్లకు పట్టించుము.

4 పొగాకు, కరిధూపము, పొట్లాకునూగు, రాతి

సున్నము, ఆసపాకు సమానభాగములుగానూరి గాయములకు పట్టించుము.

5 సీతాఫలపాకు గుప్పెడు, రాతిసున్నము 1 తులము కలిపి నూరి పుండ్లకు పట్టించుము.

6 కుందేటినెత్తురు 6 తులములు, ఉమ్మెత్తాకుపసరు అర్ధశేరు తేనె 4 తులములు కలిపి మర్దించుము.

7 కరిధూపము సున్నము కలిపివేయుము.

8 హారతికర్పూరము కరిధూపము కలిపి కట్టుము.

9 వస, కరిధూపము సున్నము నూరి వేయవలెను.

10 గాడిదగడపాకుపసరు, రాతిసున్నము, కరిధూపము కలిపి పదికట్లు కట్టుము.

11 పొట్లాకు కరిధూపము సున్నము కలిపి వేయుము.

12 జెముడుపాలు ఆముదము పసుపు కలిపికట్టుము.

13 సొరాకు, రాతిసున్నము, కరిధూపము, వెన్నకలిపి కట్టుము.

14 కుక్కపొగాకు, వస, కరిధూపము కలిపి కట్టుము.

## చేపుటకు

1 అడ్డసరపాకు 2 గుప్పెళ్ళు ఉప్పుచేరెడు జీలకర్ర 1 తులము సుగంధపాలు 4 తులములు నూరి అడ్డెడుమజ్జిగలో కలిపి త్రాగించుము.

2 చేకొణితాకు 2 గుప్పెళ్ళు తెల్లఆవాలు 1 తులము ఉప్పుచేరెడు పులిచల్ల అర్ధశేరు కలిపి త్రాగించుము.

3 బంధము వేయనీయక పొడుచుచూ దూడను దగ్గరకు చేరనీయక గంతులువేయుచుండు పశువు పొదుగునకు పుల్లతీగె రసము రాచిన చేపువచ్చి పాలను పిండుకొననిచ్చును.

**4** పాలు యీాయక తిప్పలుపెట్టు పశువునకు నెయ్యి పావు శేరు గోధుమగంజి అర్ధ శేరు గంజి శేరు కలిపి 4 దినములు పెట్టుము.

5 సేగుర్రాకు 3 తులములు పచ్చిపసుపు ½ తులము మిరియాలు 4 తులములు ఆవుపంచితము పావు శేరు కలిపి ముక్కులలోనికి నస్యము చేయుము.

6 కన్నెకోమలితీగరసము పావు శేరు తెలికపిండి సవా శేరు కలిపి శరీరమునకు రాయుము.

7 పటికబెల్లం 6 తులములు ఆవాలు 1 తులము నేల తాడి 2 తులములు దురదగొండి గింజలు 2 తులములు ఆవు నెయ్యి శేరు కలిపి త్రాగించుము.

8 తెల్లవారుజామున పశువుకరిలో చేయిపెట్టి ఆచేతిని దూడశరీరమునకుపూసి పశువుచే నాకించిన పాలుయిచ్చును.

9 పుల్లతీగెను తొక్కి లోపలికి పెట్టుము. దీనినే చేపాకు అందురు.

10 దురదగొండిఆకును కొద్దిగా తీసికొని వెన్నుభాగము నకు రాయుము.

## —♦ మలిమిడి (Sprain) ♦—

1 ఆముదములో చిత్రమూలపుపొడి కలిపి కట్టిన తగ్గును.

2 సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, చిత్రమూలము కలిపి నూరి ఆముదముతో వండి గోరువెచ్చనిది కట్టవలెను.

3 దుష్టుపువేళ్ళు మిరియాలు నూరి రసముతీసి ముక్కులలో పిండుము.

4 చిర్రికూర దుష్టుపువేళ్ళు నూరి నీటితో వండి కట్టవలెను. ఇదికట్టిన తీపు తగ్గును.

5 గోలిమిడిఆకు మిరియాలు మెత్తగానూరి నీరుడుతో వండి కట్టిన తగ్గును.

6 ఆముదములో వామింటాకు త్రొక్కి పాకముచేసి కట్టవలెను.

7 చిత్రమూలము, గజ్జేరు, త్రికటుకములు నూరి కట్టవలెను.

8 నేలవేము మిరియాలు నూరి ఆముదముతో కలిపి కట్టుము.

9 తిప్పతీగెఆకులు, ఆవునెయ్యి, చిత్రమూలము, ఆవాలు, ఆముదము మెత్తగానూరి కట్టిన బాగుగా పని చేయును.

10 తులసి, దుష్టుపాకు, కరిధూపము, మిరియాలు, ఆముదము కలిపికట్టిన తగ్గును.

11 గుంటకలగర చిత్రమూలము ఆముదము కలిపి కట్టిన తగ్గును.

12 బర్రెపేడ చెంచలిఆకు వండి కట్టినతగ్గును.

13 వేయియిగుళ్ళు చిత్రమూలము వెంపలిఆకు చిర్రికూర చేపపెంట పాకముచేసి కట్టుకట్టుము.

14 తుత్తురాకు కరిధూపము కలిపి కట్టుము.

15 నేలవేము కరిధూపము చిర్రికూర ఆముదముతో వండి కలిపి కట్టుము.

—♦ ఉంగిడి ♦—

1 పులుకలిలో మష్టుపువేళ్లనూరి సారముతీసి ముక్కరంధ్రములలో పోసి కన్నులకు ఇంగువపెట్టిన తగ్గును.

2 నల్లేరుచిగుళ్లు దవుడలలోపెట్టి కొరికించవలెను.

3 పులికలిలో ఉప్పు నల్లేరు కలిపిత్రొక్కి పెట్టవలెను.

4 కొమ్ములకు నూనెవత్తులుచుట్టి కాల్చి జాముసేపుంచిన తగ్గును.

5 కుంకుడుకాయగంధము కనులకు పెట్టవలెను.

6 నిమ్మపండ్లరసము, నల్లేరురసము కలిపి మూడుగొట్టములు పెట్టవలెను.

7 చిర్రిచెట్టు దంచి రసముతీసి పులుకలితో మూడు గొట్టములు త్రాగించవలెను.

8 గోగువరుగుగాని, దోసకాయలుగాని పెట్టినతగ్గును.

9 చింతపండుపులుసు మూడుగొట్టములుపెట్టిన తగ్గును.

10 దీపపుకొడిచే జిల్లేడుపత్రి పొట్లములుగాకట్టి చమురును కాచి మాడునపెట్టిన తగ్గును.

11 తేనె సుమారు అరసోలెడుపోసిన ఉంగిడి తగ్గును.

12 కృష్ణతామరదుంపను ముక్కలుగగొట్టి కలిచే

నూరి మిరియాలపొడివేసి కలిపి కాచి త్రాగించిన ఉంగిడి తగ్గును.

13 కుంకుడుకాయలరసము త్రాగించుము.

—♦ ఇసువాయి ♦—

1 తంగేడుచిగుళ్లు గుప్పెడు నూరి అర్ధసేరు కలితోకలిపి పెట్టుము.

2 కుక్కపాలాకు రెండుగుప్పెళ్లు నూరి, సేరుపులుకలితో కలిపిపెట్టుము.

3 ఆముదము అర్ధసేరు, ఉప్పు 2 తు కలిపి త్రాగించుము.

4 ఇంగువ 3 తు చింతపండుపులుసు అర్ధసేరు ఉప్పు 3 తు కలిపి త్రాగించుము.

5 చేకొణితాకుపసరు అర్ధసేరు, ఆముదము అర్ధసేరు కలిపి కాచి, దానిలో ఉప్పు 2 తు కారము అరగుప్పెడు, కలినీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

6 ఆముదము చేకొణితాకువండి ఉప్పు, కారము, కలితో కలిపిపెట్టవలెను.

—♦ మూవిపడుట ♦—

1 తవ్వెడు నువ్వులనుతొక్కి సేరునీటిలో కలిపి పెట్టుము.

2 పులుచల్లలో కందదుంపనూరి కలిపిపెట్టుము.

3 ఆముదము సవాసేరు త్రాగించుము.

4 సెనగలు నానబెట్టిపెట్టుము.

## —♦ మావితినినచో ♦—

1 అనుములు పావుసేరు, పచ్చిపుచ్చాకుపసరు అర్ధసేరు, మజ్జిగ సేరు కలిపి త్రాగించవలెను.

2 వాముురసము అర్ధసేరు, ఉప్పుచేరెడు, ఆముదపుపప్పు గిద్దెడు సేరు బియ్యపునీటిలో కలిపి త్రాగించవలెను.

## —♦ చూలు నిల్పుటకు ♦—

1 కరివేపాకు గుప్పెడు వరిబియ్యము గుప్పెడు కొర్రలు 2 గుప్పెళ్లు కలిపి నూరి 15 దినములు పెట్టుము.

2 వెలిగారము 4 తులములు మజ్జిగ సేరు కలిపి 20 దినములు త్రాగించుము.

3 దుష్టపువేళ్లు అరగుప్పెడు ఆవునెయ్యి అర్ధసేరు కలిపి 15 దినములు పెట్టుము.

4 లవంగాలు ¼ తు నిమ్మకాయంత వెన్న కలిపి 15 దినములు పెట్టుము.

5 పచ్చి వంకాయ కస్తూరి పసుపు నూరి వుండలు చేసి మూడు దినములు తినుపించుము.

6 కాచిన మజ్జిగ ప్రతిదినము త్రాగించిన చూలు కట్టును.

## —♦ ఈనలేకపోవుట ♦—

1 గురువింద వేరు రసము 2¼ తు కలినీరు అర్ధసేరు కలిపి గర్భకోశమునకు పట్టించుము.

2 ఈచుకొని పోయినచో దూడనులాగి ఆవుపాలు అర్ధ సేరు ఇంగువ 2 తు కలిపి పెట్టుము.

—♦ తోకనుసిమిరి ♦—

1 ఉప్పు 2 తులములు ఆవాలు ¼ తులము అల్లము 1 తులము కలబందపసరు పావు శేరు పులుకలి శేరు కలిపి మూడుదినములు పెట్టుము.

2 పిచ్చికుసుమాకుపసరు 10 తులములు నీలిమందు 1 తులము కలిపి నుసిమిరికి అప్పుడప్పుడు రాయుచుండుము.

3 గేదెపేడరసము పావుసేరు బ్రహ్మజెముడుపాలు ¼ తులము ఆముదము 3 తులములు కలిపి రాయుము.

4 మూరొ్కొండాకుపసరులో మిరియాలపొడి తగినంత కలిపి రాయుము.

—♦ తోకగురుజు ♦—

1 తోకచివర నరికి నెయ్యి కాచి వేడిగానున్నపుడు ముంచవలెను.

2 కుసుమఆకు నూరి తోకచివర రాసిన వెండ్రుకలు వచ్చును.

3 అల్లము ఉప్పు పులిచల్లలో కలిపి రాయుము.

4 అల్లము కలబందగుజ్జు ఆవపిండి మెత్తగానూరి పులుచల్లలో మురగసిచ్చి దినమునకు మూడుగొట్టములు పెట్టవలెను.

—♦ శలతెవులు ♦—

1 వాయురసము అర్ధశేరు కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించుము.

2 సొంఠి 2 తు పిప్పళ్లు 1 తు మిరియాలు 1 తు కలిపి కలిసీరు అర్ధశేరు కలిపి త్రాగించుము.

3 శేలాకుపొగ ముక్కురంధ్రములకు అప్పుడప్పుడు పట్టించుము.

4 పశునేత్రాంజనము కండ్లలో పెట్టుము.

5 శేలగంధము కన్నులలో పెట్టుము.

—♦ ఈదుపులి ♦—

1 రావిచెక్క రసము అర్ధశేరు పచ్చిపాలు అర్ధశేరు శొంఠి 1 తులం కలిపి నాలుగుదినములు త్రాగించుము.

2 దిరిసెనాకుపసరు అర్ధశేరు నరమూత్రము పావు శేరు పసుపు 1 తులం మిరియాలు ½ తు కలిపి త్రాగించి కొంత ముక్కురంధ్రములో పోయుము.

3 పశువుమక్కెలకు దొండాకుపసరు వెన్న కలిపి మర్దించుము.

4 జాంబవంతుని పాదము ఆకారముగా పశువు మక్కె మీద రక్ష వేయుము.

—♦ మోకాళ్లు కాళ్లవాపులు, నొప్పులు ♦—

(Pains in the joints or knees)

1 కలబందమట్టను రెండుతునకలుగా విడిపోకుండా

ఉండునట్లుచేసి ఆ చెక్కలనడుమ నల్లజీలకర్ర మెత్తగానూరి పెట్టి మూసి గాలిలో ఆరాత్రియుంచి మరునాడు తినుపించుము.

2 గచ్చాకు మిరపకాయపొడుము సమానభాగములు కలిపి నీటిలోనుడికించి వెలగకాయంత ముద్దజేసి మూడుదినములుపెట్టుము.

3 గానుగవేరురసము మర్దనచేయుము.

4 నూనెలో నల్లమందువేసి కాచి ఆ వేడినూనెలో నిమ్మకాయబద్ద ముంచి దానిచే కాపుతీసిన తగ్గును.

5 బాలింతబోలు నిమ్మరసములోకలిపి పట్టువేయుము.

## —♦ దృష్టిదోషము ♦—

1 పశువునకు దృష్టిదోషము తగిలినవెంటనే జొన్నలు వేపాకు ప్రత్తిగింజలు ఉప్పుతెచ్చి పశువునకు దిగతుడిచి నిప్పులోపోయుము. దృష్టిదోషము పోవుటకు తాళ్లువేయించుట కూడ మంచిది.

## —♦ పొడుచుపశువు ♦—

కండ్లలో మిరియాల గంధము వారమున కొకసారి పెట్టుము.

నువ్వులనూనె కండ్లలో వారముదినములు పెట్టుము.

## —♦ చర్మరోగములు (Skin diseases) ♦—

1 తుమ్మచెక్కపొడి 10 తు వేపచెక్కపొడి 10 తు కర్పూరము 1 తు కలిపి పుండ్లకు, గాయములకు పట్టించుము.

2 కుప్పింటాకురసము 5 తు సున్నము 1 తు నిమ్మ రసము 1½ తు కలిపి నుసిమిరి, తామర, గజ్జికి రుద్దుము.

3 పటికపొడి 1 తు కవిరి ½ తు కొబ్బరిగాని వ్యాసు లైనుగాని కలిపి వ్రణములకు పుండ్లకు రాయుము.

4 ఇంగువ 1 భాగము, స్పిరిట్ ½ భాగము, వ్యాసు లైను 6 భాగములుకలిపి చర్మముపైకలుగు పుండ్లకు అప్పు డప్పుడు రాయుము.

5 గంధకము ½ తు బోరికుఆసిడ్ 1 తు వ్యాసులైను 4 తు మైలతుత్తము ¼ తు కార్బాలిక్ ఆసిడ్ 10 చుక్కలు కలిపి నుసిమిరి మొదలగు మొండిచర్మవ్యాధులకు ఉపయో గించుము.

6 కర్పూరము, వెలిగారము, జింకుఆక్సైడ్ కలిపి పుండ్లకు అద్దుము.

7 తాల్చినముసిబొగ్గు 4 తు కర్పూరము ½ తు గంధ కము 1 తు బోరికుఆసిడ్ 1 తు కలిపి రసికారుపుండ్లకు అద్దు చుండుము.

8 కవిరిని తేనెతోకలిపి పుండ్లకు రాయుము.

9 పొగాకుపొడి ½ తు సీతాఫలపాకుపొడి 10 తు కర్పూరము ½ తు కలిపి దుర్వాసనవేయు పుండ్లకుపట్టించుము.

10 నీలిమందు 1 తు గంధకము 1 తు వ్యాసులైను 4 తు కలిపి చర్మరోగములకు వాడుము.

11 కుంకుమపొడి, గంధకము, బోరాక్సు సమానభాగ ములు కలిపి చర్మరోగములకు వాడుము.

12 కర్పూరతైలము వేపనూనె కలిపి గాయములకు, నుసిమిరికి రాయుము.

13 పసుపు 2½ తు పొగాకు 2½ తు కర్పూరము 1 తు కలిపి అన్ని పుండ్లకు వాడిన బాగుగా పనిచేయును.

14 రావిచెక్కబూడిద సున్నము సమానభాగములు తీసికొని వెన్నతో కలిపి రాసిన దురదలు మచ్చలు తగ్గును.

15 నువ్వులనూనె కిరోసినాయిల్ కలిపి రాయుము.

16 గాడిదగడపాకుపొడిని ఆముదముతో కలిపి రాయుము.

17 కృష్ణతులసిఆకురసములో నిమ్మరసము కలిపి రాయుము.

18 కుప్పింటాకురసములో సున్నముకలిపి రాయుము.

19 అవిసెఆకుపసరు ఉప్పు కలిపిరాయుము.

## దీర్ఘవాతనొప్పులు (Chronic Rheumatic Pains)

1 కర్పూరతైలమును కొబ్బరినూనెలోగాని, నువ్వుల నూనెలోగాని కలిపి మర్దనచేయుము.

2 నీరుల్లిపాయల రసములో ఆవనూనె కలిపి మర్దన చేయుము.

3 వసపొడిని సారాయితో కలిపి రాయుము.

4 వెల్లుల్లిరసము ఆముదముతో కలిపి రాయుము.

5 సన్నావాలనూనెలో హారతికర్పూరము కలిపి రాయుము.

6 వావిలాకుపసరులో తగినంత కర్పూరము కలిపి పట్టించుము.

7 కొర్నాసిచమురునుగాని, అడవిపందిచమురునుగాని రుద్దుము.

8 చిత్రమూలమును కొబ్బరినూనెలో కలిపి కాచి మర్దన చేయుము.

9 సరమామిడిచెక్కను షాలతో నూరి పట్టువేయుము.

—♦ రశి నెత్తురు కారునపుడు కడుగునవి ♦—

1 పటిక 2½ తు నీరు సేరున్నర కలిపి కడుగుము.

2 అన్నభేది 2½ తు నీరు శేరు కలిపి కడుగుము.

3 మైలతుత్తము పావుతులం నీరు సేరు కలుపుము.

4 తుమ్మచెక్కపొడి 2½ తు నీరు 2 సేర్లు కలుపుము.

5 కవిరి 2 తులములు నీరు సేరున్నర కలుపుము.

6 నవాసాగరము 1½ తు సూరేకారము 1½ తు ఉప్పు 1 తు నీరు 2 సేర్లు కలిపి చల్లదనమునకు వాడవచ్చును.

7 ఇంగువ 2 తు నీరు 2 సేర్లు కలుపుము.

8 పొటాషియం పర్మాంగనేట్ లోషను వాడుము.

9 మాచికాయపొడి 1 తు నీరు సేరు కలుపుము.

10 నేరేడుచెక్కపొడి 2½ తు నీరు సేరున్నర కలుపుము.

11 కరక్కాయపొడి 1 తు నీరు సేరున్నర కలుపుము.

12 వేపచెక్కపొడి 2½ తు నీరు సేరున్నర కలుపుము.

13 ఫినైల్ లోషనును వాడుము.

—♦ క్రిమిహారములు ♦—

ఇంగువ 1½ తు గంధకము 2½తు మోదుగగింజలు 2½ తు జావ 1 శేరు కలిపి త్రాగించవలెను.

—♦నొప్పిని తెలియజేయకుండ మత్తునుకలుగజేయు మందులు♦—

1 నల్లమందు 1 తు అల్లము 1 తు నాటుసారాయి 10 తు ఇంగువ 1 తు జావ 1 శేరు కలిపి త్రాగించవలెను.

2 గంజాయి 1 తు ఇంగువ 1 తు సొంటి 1¼ తు సారాయి 10 తు జావ 1 శేరు కలిపి త్రాగించవలెను.

—♦ వగరౌషధములు ♦—

1 సీమసున్నము రెండున్నర తులములు కవిరి ఒకటిన్నర తు వాము రెండున్నర తు జావ 1 శేరు కలిపి త్రాగించవలెను.

2 మైలతుత్తం ⅛ తు నీరు 1 శేరు కలిపి త్రాగించవలెను.

—♦ సామాన్యముగా ఆరోగ్యమునిచ్చు మందులు ♦—

1 నవాసాగరము ఒకటింబావు తు గంధకము 2 తు వాము ఒకటిన్నర తు ముసిడివిత్తులు ⅛ తు జావ 1 శేరు కలిపి త్రాగించ వలెను.

2 ముసాంబ్రము 1 తు సొంటి రెండున్నర తు ఉప్పు రెండున్నర తు గంధకము రెండున్నర తు జావ 1 శేరు కలిపి త్రాగించ వలెను.

—• చర్మరోగములకు •—

1 కర్పూరము 1 భాగము, వేపనూనె 10 భాగములు కొబ్బరినూనె 20 భాగములు కలిపి శరీరమునకు పట్టించవలెను.

2 గంధకము 2 భాగములు కర్పూరము 1 భాగము మైలతుత్తము 1 భాగము అవిసెనూనె 5 భాగములు కలిపి శరీరమునకు పట్టించవలెను.

ఈ దిగువవ్యాధుల పేర్లక్రింద నుదహరింపబడిన మందులు ఆయా వ్యాధుల కుపయోగింపనగును. ఆయా మందులు అనుభవమునుబట్టి జాగ్రత్తగా విచారించి మరియు వాడుక చేయనగును. విషపదార్థములయందు మోతాదులను బహు మెలకువతో గమనించవలయును. మందుల గుణములనుగ్రహించుట అత్యంతావసరము.

పెద్దరోగము:—నాగజెముడు, తాడికాయలు, కరక్కాయలు, సొంఠి, పిప్పళ్లు, మిరియాలు, ఉసిరికపప్పు, ఆవాలు, మనుష్యునిమూత్రము, దిరిసెనవేళ్లు, ఎలుగుబంటినెత్తురు, చేదుబీరాకు, గుంటకరాకు, వెదురాకు, మోదుగపువ్వు, తెల్లతుమ్మచెక్క, నల్లేరు, అడ్డసరము, గురువిందవేళ్లు, తెల్లజిల్లేడు, దేవదారు, సారాయి, నువ్వులనూనె, పాతచింతపండు, కలినీరు, ఉప్పు, పొటాషియంపర్మాంగనేట్, సీమఅవిసెనూనె, కార్బాలిక్ ఆసిడ్, వరిగంజి, పటిక, ఫినైల్, సీమసున్నము కవిరి, మాంచికాయలు, నల్లమందు, గంజాయి, పచ్చిపంది పెంట, నీరు, బోరిక్ ఆయింట్ మెంట్, పశువ్రణహారి మలాము.

దొమ్మలు :— వెల్లుల్లిపాయలు, మిరపకాయలు, ఆవాలు, వేడినీరు, వస, ఓమము, దుష్టుపాకు, వామింటాకు, తుమ్మిఆకు, బాడిసపాకు, నల్లజీలకఱ్ఱ, మిరియాలు, పసుపు, వేపాకు, కుప్పింటాకు, కరక్కాయలు, తాడికాయలు, వుసిరిక పప్పు, సొంఠి, పిప్పళ్లు, ఎలుగుబంటిరక్తము, కరిధూపము, నల్లమేకపంచితము, మోదుగవ్వు, కలినీరు, సున్నము, కుంకుడుకాయలరసము, సారాయి, కల్లుబెల్లము, ఉలవలు, నరమూత్రము, సున్నపుతేట, కొఱ్ఱపిండి, దిరిసెనచెక్క, ఆవుపాలు, రేప్పాలయిగుళ్లు, కుక్కపాలాకు, గాడిదగడపాకు, జటామాంసి, తెల్లగడ్డలు, సూరేకారం, పొగాకు, కర్పూరము, ఆవుపంచితము, గలిజేరాకు, పెన్నేరు, వాతలు, కర్పూరతైలము, వరిగంజి, కార్బాలిక్ యాసిడ్, ఫినైల్.

జబ్బవాపు:—కార్బాలిక్ యాసిడ్, జిల్లేడాకు, దుష్టుపాకు, పుట్టమన్ను, వావిలాకు, వుమ్మెత్తాకు, మేకపాలు, పసుపు, ఆముదము, గాడిదయెముక, సారాయి, పొటాషియం పర్మాంగనేట్.

గురక:—వాతలు, కార్బాలిక్ యాసిడ్, వరిగంజి, పొటాషియంపర్మాంగనేట్, ఫినైల్, సారాయి, శొంఠి, నల్లమిరియాలు.

గాళ్లు:—పెట్లుప్పు, ఉప్పు, నేలవేము, మంచిబెల్లము, పటిక, మైలతుత్తము, వెలిగారము, జొన్నలు, మంచినూనె, సీతాఫలపుఆకుపసరు, రావిచెక్క, తుమ్మచెక్క, ఫినైల్, తారు, నూకలగంజి, వేడినీరు, ఆవుమజ్జిగ, మంచినూనె,

కర్పూరతైలము, గాడిదగడపాకు, నీలిమందు, వేపనూనె, సైంధవలవణము, కొత్తిసున్నము, ఆముదము, ఆకాశధూళి, హారతికర్పూరము, బాడితఆకు.

కురము:—మష్టుపాకు, సారాయి, చేదుపొట్ల, చింతాకు, మేకపాలు, రెప్పాలయిగుళ్లు, ఏనుగపల్లేరు, బెల్లము.

మశూచి:—ఎప్సమ్‌సాల్టు, సొంటి, నీరు, కర్పూరము, కొబ్బరినూనె, వెలిగారము, బొగ్గు, మైలతుత్తము, బోరిక్ ఆయింట్‌మెంట్, పశువ్రణహారిమలాము.

రక్తమూత్రము:—ట్రిప్తాన్‌బ్లూ, ఎప్సన్‌సాల్టు, సొంఠి, ఆముదము, అన్నభేది, ముసిడివిత్తులు. నేలవేము, జావ, సీమ అవిసెగింజలు, బార్లిగింజలు, నేరేడుచెక్కఊట, మోదుగ పువ్వు, పెసరగుగ్గిళ్లు, పేరునెయ్యి, కలినీరు, సారాయి, అల్లము, నల్లమిరియాలు, వేపచెక్క, లవంగపట్ట, కావిరాయి.

క్షయ:—ట్యూబర్కులిను తగిన సంరక్షణ.

పొదుగువాపు:—ఆముదము, సొంటి, నీరు, నాటుసారాయి, నల్లమిరియాలపొడి, అయోడిన్‌తైలము, పుమ్మెత్తాకులు, బోరిక్ ఆయింట్‌మెంట్, సూరేకారము, మిరియాలు, ఉప్పు వెల్లుల్లి, ఉత్తరేణియాకు, దృష్టిదోషము, నెయ్యి, వేపాకు, నరమూత్రము, పశు వ్రణహారిమలాము.

నోటిపూత:—పొటాసియంక్లోరేట్, కోడిగుడ్లు, తేనె బోరిక్ ఆసిడ్, వెలిగారము.

నెమరుపోట్ట:—అజీర్ణాహారముచే దట్టమై యుండుట. కర్పూరతైలము, సొంటి, ఎప్సన్‌సాల్టు, సీమ అవిశనూనె, నవాసాగరము, ముసిడివిత్తులపొడి, నల్ల మిరియాలు, నాటుసారాయి, పెట్లుప్పు, నేలవేము, వాము, బొగ్గుపొడి, మిరెపకాయలు, సున్నపుతేట, ఆముదము, ఉప్పు, చీకిరేనిచెక్క, మిరియాలు, కురాసానివాము, మైసాక్షి, వావిలిచిగుళ్లు, పచ్చిగడ్డి.

కడుపుబ్బు:—కర్పూర తైలము, ముసిడివిత్తులపొడి, అవిసెనూనె, భేదిఉప్పు, మిరెపకాయలపొడి, సొంటి, సారాయి, పెట్లుప్పు, వాము, బొగ్గు, సున్నపుతేట, జొన్నదంటు, ఉప్పు, కొబ్బరినూనె, పచ్చికొబ్బరి, మజ్జిగ, ఆవపిండి, ఉర్ల గడ్డలు.

కడుపునొప్పి:—సీమఅవిసెనూనె, కర్పూరతైలము, మిరెపకాయలు, ఊడగచెక్క, సూరేకారము, జిల్లేడుపువ్వులు, వావిలాకు, దిరిసెనాకు, తంగేడాకు, వేపాకు, ఆముదము, నెయ్యి, నూనె, పొగాకు, ఇంగువ, తములపాకులు, మిరియాలు, వెల్లుల్లిపాయలు, వాము, దుష్టుపాకుపసరు, పులి కలిసీరు, పెండలపువేళ్లరసము.

విరేచనములు:—కవిరి - నూకలజావ - వాము - మైలతుత్తము - నల్లమందు - ఇంగువ - మాచికాయలు - సీమసున్నము - హారతికర్పూరము - సారాయి - తుత్తురాకు - తీండ్రకొనలు - పైడితంగేడు కొనలు - కరక్కాయ -

బెల్లము - మెంతులు - కర్పూరము - మారేడుపండ్లపొడి - దానిమ్మకాయలతొక్కలు - సోపు - సొంటి - పిప్పళ్ళు - మిరియాలు - మజ్జిగ - పైడినత్రిఆకు.

రక్తవిరేచనములు:—తుత్తురాకు - తంగేడుచెక్క - నల్లపులుగుడుచిగుళ్లు - కందులు - మోదుగపువ్వు - వేరి నెయ్యి - పెసరగుగ్గిళ్ళు - నల్లమందు - పులిసేరాకు - సీమ సున్నము - కవిరి - మాచికాయలు - గంజి - ఉడకబెట్టిన నీరుల్లిపాయలు - అవిసెవిత్తులు - బియ్యము - ఉప్పు.

లివర్ రాట్:—అన్నభేది - శొంటి - నేలవేము - నవాసాగరము - వాము - అత్తిచెక్క - యిప్పచెక్క - నేరేడు చెక్క - నల్లజీలకఱ్ఱ - వస - తాటిబెల్లము - బెల్లపుపానక ములు - సున్నపుతేట.

మలబద్ధకము:—ఉప్పు - తంగేడుచెక్క - వరిగంజి - ఆముదము - గంధకము - చింతపండుపులుసు - సారాయి.

కామాల:—నవాసాగరము - పూడగపట్టవేరురసము- మజ్జిగ - పిప్పలి - మిరియాలు - గుంటగలిజేరాకు.

రొంప:—పొటాషియంక్లోరేట్ - కర్పూరము - మంచి బెల్లము - భేదిఉప్పు - సూరేకారము - నవాసాగరము - నల్లమందు - కర్పూరము - కర్పూరతైలము - బెల్లము - అల్లము.

దగ్గు:—రావిచెక్క - పచ్చిపాలు - మిరియాలు - దిరిసెనచెక్కరసము - శొంఠి - నల్లమందు - వాయువిడంగ

ములు - బాడిదచెక్క - బాడిదఆకు - సైంధవలవణము - కుంకుమపువ్వు - తేనె - ఆవాలు - వెల్లుల్లిపాయలు - జిల్లేడు పువ్వు - నేలవాకుడు - కటకరోహిణి - అల్లము-తమలపాకులు జీలకర్ర - నీరుల్లిపాయలు - పెన్నేరుదుంప - పులిచల్ల.

కసిమిరి:— పాషాణసంబంధమైన అరఖు-పొటాషియం అయోడైడ్ - ముసిడివిత్తులపొడి - యూకలిప్టస్‌ఆయిల్-వెదురాకు - వెంపలియాకు - కలినీరు - మోదుగాకుపసరు-సొంటి-నల్లమందు - మంచిబెల్లము - అల్లము - గంటెలు - సబ్బు - గుగ్గిలము - తాటిబెల్లము - మిరియాలు.

న్యూమోనియా:—కర్పూరతైలము - యూకలిప్టస్ - బార్లిగంజి - తేనె.

ముక్కుబంతి:—పిల్లిపిసరగడ్డి - నీరుల్లిపాయలు - కుందేలుపెంటికలు - సాంబ్రాణిపొగ.

వాతము:—రావిచెక్క-దిరిశెనచెక్క- వాము - వస - పుట్టమన్ను - ఆవాలు - నీరుల్లిపాయలు - టాకలాకు - ఆకుజెముడు - పుల్లజెముడు - అప్పరెల్లిఆకు - పసుపు - మగలింగపట్టె - అడ్డసరపాకులు - పెండలపువేళ్ళరసము- సున్నపుతేట- కలినీరు - ఏరుపసరాకు- సేగుర్తాకు, వెల్లుల్లిపాయలు, జీలకర్ర-చేదుజీలకర్ర - దాల్చినచెక్క - మిరియాలు - సొంటి - ఇంగువ ధనియాలు - వావిలాకు - బాడితాకు - దిరిశెనాకు - తంగేడాకు - వేపాకు - ఆముదము - పిప్పళ్ళు - నెయ్యి - నూనె -

కుప్పింటాకు-కసివిందాకు - నేలవేము - కోష్టు-మేకపంచితము-కొబ్బరిపాలు - కల్లు - మోదుగపువ్వు.

పక్షవాతము:— నేలవేము - మునిడివిత్తులపొడి - అన్నభేది - జావ - ఆవాలు - వెల్లుల్లిపాయలు - సేగుర్తాకు - మంచినూనె.

కీళ్లవాతము:—పత్తిగింజలు - గోరింటాకు - నల్లవుమ్మెత్తాకు - నల్లమందు - వస - కర్పూరము - మంచినూనె - పశువ్రిణ మలాము.

తీటవాతము:—బూరుగబంక, నువ్వుపువ్వులు, నేపాళవిత్తులు, గానుగనూక, జొన్ననూక, పశువ్రిణహరిమలాము. నక్కవగర్పు, చేకొణితాకుపసరు, మంచినూనె, మిరియాలు, తామరదుంపలు, పసుపు, బెండవేళ్లు, పంచదార, గొర్రెపాలు కటకరోహిణి, గంటుబారంగి, సొంటి, వెలిగారము, నల్లజీలకర్ర, ఇంగువ, పిప్పళ్లు, గ్రంధిబీడు, కొడిశపాలవిత్తులు, కస్తూరిపసుపు, గుగ్గిలము, కోష్టు, తమలపాకువేళ్లు, మునగవేళ్లరసము.

ధనుర్వాయువు:—ఉప్పు - వాము - నల్లమందు పుమ్మెత్తవస - చేదుబీరాకుపసరు _ కరిధూపము.

పీనసరోగము:—అవిశపువ్వులు - ఆవునెయ్యి - ఉప్పు రసకర్పూరము - వాకుడుగాయలు.

ఊర్ధ్వశ్వాసరోగము:—కర్పూరము - మునాంబ్రిము నూరేకారము - నల్లమందు.

తుమ్ములరోగము:—నల్లమందు- కర్పూరము-కర్పూర తైలము - వెంపలియాకురసము - నీరుల్లిపాయలరసము-యూకలిప్టస్ఆయిల్.

నీరుచురుకు:—పెట్లుప్పు - సూరేకారము - గుగ్గిలము కర్పూరతైలము - దూసరాకు- తాటిబెల్లము - మంచిబెల్లము.

మలమూత్రబంధరోగము:—ఉప్పు - వాము _ గురివిందాకుపసరు - కలినీరు - తంగేడుచిగుళ్లు - రాజనపుపిండి.

చేరుమాద:—కసిందాకు-నల్లజీలకఱ్ఱ- సూరేకారము-గోరోజనము - కర్పూరతైలము - గుంటగలిజేరాకుపసరు - ఎఱ్ఱజొన్నలు - కలినీరు - సొంటి - పిప్పలి - మిరియాలు.

ఉంగిడి:—వావిలాకురసము - కుంకుడుగాయనురుగు - నిమ్మరసము - పాతచింతపండురసము - నల్లేరు -అమ్మోనియం క్లోరైడ్.

పెనుబాలవాపు:—ఉడికించిన పేడ - మిరియాలు - తాళిసపత్రి - పెట్లుప్పు - హారతికర్పూరము - గంజి.

అరుగ్రివాపు:—దొండాకు - దుష్టుపాకు - పీతచమురు-బొక్కెనాకు - బిళ్ళుడుమసి - బోరిక్ ఆయింట్మెంట్ - రాతితడిసున్నము - రేగడబురద - పశువగ్రిణ హరిమలాము.

పేగులవాపు:—నల్లమందు - నెయ్యి - వేడికాపులు - బియ్యపుకలి - వెన్న - పచ్చికొబ్బరి-పశువగ్రిణ హరిమలాము.

కల్లవాపులు:—ఆవుపేడ - పాలు - వావిలాకు - పుట్ట

మన్ను - మిరియాలు - చేదుజీలకర్ర - సొంటి - వుమ్మెత్తాకు దుష్టుపాకు - గాడిదగడపాకు - పశువర్ణ హారిమలాము.

మెడమీదిపుండు:—కర్పూరము - ఎందుఅరటియాకు చూర్ణము - వెన్న - బూడిద - ఆవపిండి - మిరపకాయలు - కొబ్బరినూనె - పశువర్ణ హారిమలాము- గుంటకరాకు - రాతి సున్నము - కార్బాలిక్ యాసిడ్.

తలతిరుగుడురోగము:—కరిధూపము |- శొంఠి - మిరియాలు - పిప్పలి - వాతలు - చేదుబీరాకుపసరు - నెయ్యి.

నల్లకప్పువేయుట:—వెదురాకు - నేలవేము - నల్లేరు- అడ్డసరాకులు - ఆవపిండి - గుమ్మడిపండు - కడుగు.

నల్లతెగులు:—ముసాంబరము - సొంటి - భేదిఉప్పు - దిరిశెనచెక్కరసము - నరమూత్రము.

అవిరి:—పెంకుపొడి - పేరినెయ్యి - అరటిదుంపరసము- అరటియాకురసము - ఉప్పు - రసకర్పూరము - వాకుడాకు - వెన్న - పశునేత్రాంజనము.

కంటిలోపువ్వులు:—దొండాకుపసరు - మిరియాలు - మండపసుపుకొమ్ము - ఉప్పు - కాకరాకు - పొగాకు - పసిబాలురమూత్రము - దిరిసెనచెక్కరసము - పిప్పళ్ళు - సొంటి వ్యానుశైను - తేనె - సబ్బు - చీనాపంచదార - లవంగాలు - అక్కలకర్ర - ఉప్పుడుబియ్యము - తాచుపాము తలకాయ - నిమ్మకాయ - పశునేత్రాంజనము.

కన్నులుపుసికట్టుట:—పటిక - ఆముదము - మైలతుత్తము - పసుపు - కుంకుమ - ఖర్జూరగింజ - కందిగింజ - పశునేత్రాంజనము.

కన్నులెఱ్ఱబారినందుకు:—చిల్లగింజ - చింతగింజ - మైలతుత్తము - సాలామిశ్రి - గోగువేరు - పటిక - కందిగింజ - వెన్న - పశునేత్రాంజనము.

కంటిపొరలు:—బొమ్మజెముడుపాలు - వెన్న - నీరుల్లిపాయరసము - దొండాకుపసరు - సబ్బు - పటికిబెల్లము - వాకుడాకు - బెల్లము - జీడిచమురు - జిల్లేడుపాలు - కొబ్బరినూనె - పాలతుత్తము - పశు నేత్రాంజనము.

రేచీకటి:—చోళ్ళు - ఆవువెన్న - ములగాకురసము - తేనె - చేపక్రొవ్వు - పశునేత్రాంజనము.

చెవిరోగములు:—మంజిష్ట - ఇంగువ - సైంధవలవణము - వెల్లుల్లిపాయలు - ఆవుపాలు - తేనె - వేపనూనె - గవ్వసున్నము - స్పిరిట్ - బోరిక్ ఆసిడ్ - వావిలాకు మంచినూనె.

ఎముకలు విరుగుట:—చింతగింజలబెందడు - ప్యారిస్ ప్యాస్టరు - ఉత్తరేణియాకు - కోడినెత్తురు - వావిలాకుపసరు - గలిజేరాకుపసరు - మిరియాలు - మినపపిండి - వెన్న - పాలు.

బెణుకులు:—కర్పూరము - సబ్బు - కర్పూరతైలము - ఆవాలపొడి - కొబ్బరినూనె - పచ్చిజెముడుపాలచెక్క - నేపాళనూనె - పశువ్రణ హారిమలాము.

మలిమిడికుంటు:—నూనెకడియము - చిత్రమూలము- ఆముదము - సొంటి - పిప్పళ్ళు - మిరియాలు - మైలతుత్తము - ముర్దారుసింగు - హారతికర్పూరము - కారింగువ - మిరియపుగింజలు - దుష్టుపాకులు - పశువ్రణహారిమలాము.

మెత్తగాళ్ళు:—కరక్కాయలు-కొత్తసున్నము- పటిక బెల్లము - ముండ్లతోటకూర - తెల్లబాడిదచెక్కరసము - మజ్జిగ - తవుడు - నీరు - పశువ్రణహారిమలాము.

కొమ్ములువిరుగుట:—ఫినైలు - ఫ్రెంచివార్నిసు- బలుసాకు - వెంట్రుకలు - పశువ్రణహారిమలాము.

కొమ్ముడొల్ల:—వస - రసకర్పూరము - పొగాకు మంచిగంధము - మిరియాలు - చేదుజీలకఱ్ఱ - ఆవాలు వెల్లుల్లిపాయలు - వాకుడాకుపసరు.

గాయములు:—పటిక - వేడినీరు - పొటాషియంపర్ మాంగ్నేట్ - వెలిగారము - మసిబొగ్గు - మైలతుత్తము మాచికాయ - కాచు - కర్పూరతైలము - మంచినూనె జీడివిత్తులు - వస - కారింగువ - సీమసున్నము - సీతాఫలపాకు వేపాకు - చింతాకు - కర్పూరము - పొగాకు - తెల్లమంగ - అన్నభేది - టించర్ అయోడిన్ - ఫ్రెంచివార్నిసు - నీలిమందు - పశువ్రణహారిమలాము.

పాడిపశువుల పాలగ్రంధుల రోగములు:—కార్బాలిక్ యాసిడ్ - గ్లిసరిన్, సోపు - జీలకఱ్ఱ - ధనియాలు - గంధకము బోరిక్ ఆయింట్మెంట్ , పశువ్రణహారిమలాము.

పాలుచేపుట.—చేకొణితాకు - తెల్లావాలు - జీలకఱ్ఱ కల్లుప్పు - ఆయాకు - మిరియాలు - పచ్చిపసుపు - ఉలిమిడి ఉసిరిక - మినుములు - కలకండ - ఆవాలు - నేలతాటిగడ్డ దురదగొండిగింజలు - ఆవునెయ్యి - మజ్జిగ - తాడికాయలు సైంధవలవణము.

మావిపడవేయుటకు:—సారాయి - చన్నీళ్లు - బెల్లము బెండకాయలు - నువ్వులు - తాడికాయలు - కంద - పులిచల్ల.

మావితిన్నపశువునకు:—గోధుమగంజి - నెయ్యి - అనుములు - పుచ్చాకు - మజ్జిగ - తాడికాయలు - జీలకఱ్ఱ - ఉప్పు.

## లేగదూడల జబ్బులు

నోటిగాలి:—మంచినూనె - తుమ్మాకు - నేయి - తుమ్మగింజలు - నీరుల్లిపాయలు - పటిక వెలిగారము.

కడుపులోని పురుగులు:-గ్రంధరాజము - కటకరోహిణి - ఉప్పు - నువ్వులనూనె - గ్రంధరాజపుబంక - మంచినూనె.

అజీర్తి:—గంజాయి - పెన్నేరుగడ్డ - సొంటి - ఎప్సన్ సాల్టు - వాము - ఆముదము - గాలిమిడాకు.

పారుడురోగము:—సొంటి - పిప్పళ్ళు - మిరియాలు - మజ్జిగ - వెన్న - పసుపు - రేగడిమట్టి - పెరుగు - సీమసున్నము - కవిరి - మాచికాయలు.

మలబద్ధకము:—ఆముదము - శొంఠి - వేడినీరు - ఎప్సన్ సాల్టు - చేదుజీలకఱ్ఱ - ఉప్పు - చింతపండు - గాడిదగడపాకు.

బొడ్డుపుండ్లు:—పటిక - మైలతుత్తము - వ్యాసులైను - బోరిక్ ఆసిడ్ - ఫెర్రించివార్నీసు - కర్పూరము - సీతాఫల పాకు - పశువ్రణహారిమలాము.

రక్తచెర్ది:—కోడిగుడ్లు - చెరుకుపాలు - తులసిఆకు రసము - ఆవుపాలు - గంగసింధూరము - మైలతుత్తము - వెన్న - పశువ్రణహారిమలాము.

పంపర:—గాడిదగడపాకు - దుష్టుపాకు - ఆముదము - జిల్లేడాకు - మైలతుత్తము - మిరియాలు - వస - కవిరి - తురకవేపాకు - పేడవుడుకు - పశువ్రణ హారిమలాము.

గజ్జి, తామర:—గంధకము - కొడిశెవిత్తులనూనె - పొగాకు - ఉప్పు - కర్పూరము - మైలతుత్తము - పెరుగు - బోరిక్ ఆసిడ్ - జింకుఆక్సైడ్ - వేపనూనె - ఫినైల్ - కర్పూరతైలము - తుపాకిమందు - నేపాళవిత్తులు - కామంచాకు పసరు - ఆవుపంచితము - గాడిదగడపాకు - దుష్టుపాకు - సున్నము - గోమూరితైలము.

తోకనుసిమిరి:—నల్లేరు - పసుపు - మీగడ - మైలతుత్తము - వస - మేకవదరు - విమబొద్ది - సూరేకారము - ఆముదపుపలుకులు - కొబ్బరినూనె - తోకక్రిమిసంహారిణి.

కణతులు:—కటకరోహిణి - కోష్టు - ఆవాలు - వెలిగారము - జొన్నపిండి - గండఫెరోజా - కస్తూరి - పసుపు - కొట్టుపసుపు - గంధకము - మణిశిల - ఆవునెయ్యి - పిండికట్లు - పశువ్రణ హారిమలాము.

కాలినబొబ్బలు:—రాతితడిసున్నము - గ్లిసరీన్ - వంటఆముదము - సీమనూనె - కొబ్బరినూనె - ఐడోఫారము - మజ్జిగ - నవనీతము - సున్నపునీరు - పిడకబూడిద - పశువ్రణహారిమలాము.

పొడలు - గోమారులు - బుడ్డపుంజులు - పేలు - మిన్నల్లులు - దోమలు:—వస - మంచినూనె - దుష్టుపాకు పసరు - ఫినైల్ - ఫ్రెంచివార్నీసు - ఉమ్మెత్తవిత్తులు - పొగాకు - విభూతి - పుల్లమజ్జిగ - బూడిద - కర్పూరము - అమరశిలగంధకము- వేపాకు - కార్బాలిక్ యాసిడ్ - గోమారితైలము.

విషపురుగుల కాట్లు:—అన్నభేది- కోడిగుడ్లు- పాలు గంజి - నాగముషిణి - గాడిదగడప - తెల్లయీశ్వరి - తిప్ప తీగె - ఎర్రకలువదుంప - గుంటకరాకు - కావిరాయి - కరి ధూపము - గొబ్బివేళ్ళు.

విషములు పెట్టుట:—నాగముషిణి - తెల్లజిల్లేడు - ఉప్పు - గాడిదగడప - గుంటకరాకు - ఈశ్వరవేరు - పిప్పళ్ళు శొంఠి - వస - మిరియాలు - వెలగబంక - సున్నపునీరు - ఘాటుసారాయి - తవుడు.

కాళ్లజాడ్యములకు:—వెల్లుల్లిపాయలు - ఆవాలు-శొంఠి పిప్పళ్ళు - మైలతుత్తము - ముదారుసింగు - హారతికర్పూరము.

# ప్రముఖుల అభిప్రాయములు

శ్రీరాములు చౌదరిగారి పశుసేవను గూర్చి చేయుచున్న కృషికి నేను మిక్కిలి సంతసించుచున్నాను. వీరు సామాన్యఆపరేషన్సు, ఔషధములిచ్చుట కూడ చేయుచున్నారు. అంటువ్యాధులవిషయమై రైతులకు బోధించుచున్నారు. నోరులేనిపశువులకు మిగుల కష్టించియు, మిక్కిలి యుత్సాహముతో సేవజేయుచున్నారు. ఎట్టి ప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) సి. వి. రత్నం,

కృష్ణా గుంటూరు జిల్లా వెటరినరీ ఆఫీసర్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన ఆయుర్వేదపశుచికిత్సాలయమును సందర్శించితిని. చికిత్సలవిషయమై చాల తృప్తికరముగా నున్నది. పశుసంరక్షణవిషయమై వీరు తీసికొనుచున్న శ్రద్ధ అపారము. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) కె. బి. నటేశయ్యరు,

జిల్లా పశువైద్యఆఫీసర్.

---

శ్రీరాములుగారి చికిత్సాలయమును చూచితిని. ఇది క్రమపద్ధతిని అభివృద్ధిజెందుచున్నది. మూగజీవులకు వీరొసంగురక్షణ మిగులప్రశంసనీయము. ఆయుర్వేదపశువైద్యగ్రంధములు వ్రాసి తత్సంబంధమైన వైద్యమును వీరు అభివృద్ధిపరచిరి. అన్ని ప్రాంతములవారు తగినసహాయము చేయుదురు గాక.

(సం) ఆర్. వీరాస్వామి,

వెటరినరీ అసిస్టెంటుసర్జన్.

---

చౌదరిగారు ఆయుర్వేదౌషధములచేతనే చికిత్సలు చేయుచున్నారు. పశువైద్యశాస్త్రమునందు అనుభవము పొందినవారై తదితరజిల్లాలనుండి రాబడిన విద్యార్థులకు బోధించుచున్నారు. ఈ సంవత్సరము గవర్నమెంటు వారిచే రిజిస్టరు చేయబడినందువలననే చాలమంది విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారని తెల్పుట సంతోషము. అంటువ్యాధులయందు కూడ వీరికి పరిచయము కలదు.

కె. యం. పేరనన్,
వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న నిఖిలాంధ్రాయుర్వేద పశువైద్యకళాశాలను, పశుచికిత్సాలయమును చూచి మేము చాలఆనంద పడుచున్నాము. కాలేజీలో చాలమందివిద్యార్థు లున్నారు. వీరిని ఆయుర్వేద పశువైద్యపద్ధతులమీద తర్ఫీతు చేయుచున్నారు. చౌదరిగారు చికిత్సలు చక్కగా చేయుచున్నారు. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

యన్. వి. శ్రీధరరావు,
వెటరినరీ సర్జన్, జి. యం. వి. సి.

యస్. శ్రీనివాసరావు,
మ్యునిసిపల్ వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన చికిత్సాలయము చూచితిని. నవీనపద్ధతులతో నడిపింపబడుచూ నోరులేని వేలకొలదిజంతువులను రక్షించుచున్న నూతనోద్యమము. ప్రశంసార్హమగు వారి యుద్యమము జయముగాంచుగాక.

కె. గురుమూర్తి,
అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటరు.

---

శ్రీ రాములుచౌదరిగారిచే నడుపబడుచున్న పశుచికిత్సాలయమును, పశువైద్యకళాశాలను దర్శించితిమి. ఆంధ్రదేశములో నేగాక రాజధానిలో కూడ వేరొకసంస్థ లేదు. వీరిపట్టుదల, మేధాశక్తి అపూర్వము. ఇట్టి సంస్థలను ఆధారము చేసికొనినగాని గ్రామపునరుద్ధారణకు మనరాజకీయవేత్తలు పెద్దలు పడుశ్రమ పరిపూర్ణఫలమునొందదు. ఈ సంస్థ అన్ని విధముల అభివృద్ధిజెందుగాక అనికూడ అభిప్రాయము.

వి. బుధవేశ్వరరావు,
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్,
2 వ సర్కిల్, గుంటూరు.

యస్. శివరామశాస్త్రి,
అగ్రికల్చర్ ఆఫీసర్.

---

చౌదరిగారి కళాశాల, చికిత్సాలయములను చూచితిని. వారు చేయుచున్నపని చాల అత్యద్భుతముగానున్నది. గ్రామపునర్నిర్మాణమునకు దగినటుల ఈసంస్థలు పనిచేయుచున్నవి. వీరు దిగ్విజయమును పొందుదురుగాక.

చంద్రశేఖరం,
డిప్యూటీరిజిస్ట్రార్
కో-ఆపరేటివ్ సొసయిటీస్.

---

చౌదరిగారి చికిత్సాలయము పరిశీలించితిమి. పశుసంరక్షణవిషయమై చౌదరిగారు అనేకరీతులుగా చాల శ్రద్ధతీసికొనుచున్నందులకు మేమెంతయు సంతసించుచున్నాము.

డి. సదాశివరెడ్డి,
మద్రాసుప్రెసిడెన్సీ డిప్యూటీ ఎడ్యుకేషనల్ డైరెక్టర్.

యం. అబ్దుల్ ఆలీ,
కృష్ణాజిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసర్.

---

ఆయుర్వేదపశువైద్యమునం దీమాత్రి ప్రకృషి మిత్రుడు సల్పుచుండు టెంతో ప్రీతికరమైనవిషయము. వీరొసగు పశువైద్యవాఙ్మయము ఆంధ్రదేశమునకును, రైతులకును మిగుల ప్రయోజనమైనది.

బి. రామయ్య,
ఎ. డిమాన్‌స్ట్రేటర్.

---

ఆంధ్రదేశములో ఆయుర్వేద పశుచికిత్సాలయములుగాని, ఆయుర్వేద పశువైద్య కళాశాలలుగాని సరియైన ఆయుర్వేద పశువైద్య గ్రంథములుగాని యింతవరకు లేవనియే చెప్పవచ్చును. ఇట్టి సమయములో "అభినవ సహదేవ" శ్రీరాములు చౌదరిగారు పై సంస్థలను తన స్వయంకృషి చే వృద్ధిలోనికి తీసికొనివచ్చుచున్నందులకు ఆంధ్రదేశములోనున్న ప్రజలందరు గర్వింపతగిన విషయము. వీరి కాలేజికూడ చాల వృద్ధిలోనున్నది. స్థానిక సంస్థలుకూడ స్టయిపెండ్సుయిచ్చి విద్యార్థులను ఈ కాలేజికి పంపుచున్నారనిన ఆంధ్రదేశమున కెంతలాభముగలదో చదువరులే గ్రహించుదురుగాక. ఇంకను తరగతులవారీగా 20 పశువైద్యగ్రంథములువ్రాసినారంటే ఎంతగొప్పమేధావంతులో పాఠకులే గ్రహించుదురుగాక. వీరి గ్రంథములు త్వరలో అప్రూవ్ చేయించి అన్ని పాఠశాలలలోను పెట్టించిన చాల ఉపయోగకరముగానుండును. నూతనముగావచ్చిన కాంగ్రెసుమంత్రులు ఈ కళాశాలను రికగ్నయిజు చేయించి అన్ని ఫిర్కాలలోను ఈ ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేయగలరని నా నమ్మిక.

ఎ. వి. రామలింగపాట్నాయక్,
యం. బి. బి. యస్.

---

డాక్టరుగారి స్వగృహమున ఒక పెద్దహాలులో పశుచికిత్సాలయము స్థాపించబడి వివిధపరికరములచే సమకూర్చబడియున్నది. పేదలనక భాగ్యవంతులనక అందరికి నుచితముగా చికిత్సలుచేయు ఇట్టి సంస్థ మరెచ్చటను లేదు. ఔషధములు తయారుచేయుటయేగాక డాక్టర్‌గారు పశురోగములను, దేహతత్వములను బోధపరచుటకు అనేకపటములు, చిత్రపటములు కూడ తయారుచేసినారు. పశువైద్యశాస్త్రమునందు శిక్షను గఱపుటకై

ఆయుర్వేద పశువైద్యకళాశాలను గూడ వీరు నడుపుచున్నారు. ఈ సంస్థ యెంత ప్రజాదరణమును బడసినదో ఇతర జిల్లాలనుండి ఈ కళాశాలలో జేరుటకు వచ్చినవారివలన తెలియుచున్నది. పదునొకండవ కమ్మ మహాజన సభయందు చౌదరిగారి సేవకై మెచ్చి వారిని "అభినవసహదేవ" అను బిరుదముచే బహూకరించిరి. ఈ బిరుదమునకు వీరెంతయు అర్హులు. వీరు పశువైద్యమునందు చేసిన కృషి, సేవయు, మంత్రిలు, జిల్లాబోర్డు అధ్యక్షులు, గవర్నమెంటు పశువైద్య ఉద్యోగస్థులు, పెద్దపెద్ద భూస్వాములు మున్నగువారిచేత ప్రొగడ్తగాంచినవి. పశువైద్యమునందు పురాతనపద్ధతు లన్నియు మార్చి అధునికపద్ధతులపై వైద్యముచేయు ఇట్టి డాక్టరుగా యుండుట మనమెంతయు గర్వించవలసిన విషయము.

చౌదరిగారి గ్రంథములను, ప్రతిగ్రామ పాఠశాల పుస్తకభాండాగారమునకు, ప్రతిఆయుర్వేద చికిత్సాలయమునకు సప్లయిచేయుటవలన స్థానికసంస్థలుచేయు అమూల్యసేవకు మేరలేదని మదరాసు శాసనసభాధ్యక్షులగు గౌ॥ బి॥ రామచంద్రారెడ్డిగారు వెల్లడించిన అభిప్రాయముతో నేనును పూర్తిగా ఏకీభవింతును. చౌదరిగారి ఉత్కృష్టసేవకై వారి నభినందించుచు వారి సంస్థాభ్యుదయమునకై నేను కోరుచున్నాను.

వి. సత్యనారాయణ,
తహశ్శీల్‌దారు, గుడివాడ.

---

ఈ చికిత్సాలయము నెంత ప్రోత్సహించిన అంతమేలు. అధునిక పద్ధతులతో నడుపబడుచున్నది. అంటువ్యాధుల నివారింపగలశక్తి ఈ చికిత్సాలయమునందు గలదు. ఈసంస్థ జయప్రదముగా సాగుగాక.

శ్రీ రాజారావు,
తహశ్శీల్‌దారు, గుడివాడ.

---

నేడుదయమున అంగలూరులో నెలకొల్పబడిన ఆయుర్వేద పశు చికిత్సాలయమును చూడగలిగినందులకు చాల ఆనందించుచున్నాను. ఈ సంస్థవిషయమై చౌదరిగారు చాల శ్రద్ధవహించుచున్నారు. వీరి పరిశ్రమ ఫలించి యీ సంస్థ మరికొన్నిటికి ఆదర్శప్రాయమై చిరస్థాయిగా వెల యుచు లోకల్‌బోర్డులయొక్కయు, భూస్వాములయొక్కయు సహాయ మునకు ప్రథమార్హమై యుండును.

యన్. నరసింహరాజు,
తహశ్శీల్‌దారు, గుడివాడ.

---

శ్రీరాములుచౌదరిగారు మూగజీవులకు ఆయుర్వేద పద్ధతులతో చికిత్స చేయుచున్నందులకు సంతోషించుచున్నాను. కొందరు విద్యార్థులు వారు స్థాపించిన పాఠశాలలో తర్ఫీయదగుచున్నారు. త్వరలో గవర్న మెంటువారు రికగ్నయిజు చేయుట మంచిది.

సి. హెచ్. వెంకటేశం,
డిప్యూటీ యిన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు.

---

రైతులక్షేమమునకై, వారిపాడిపంటలవృద్ధికై వారి గడపలపనిమికై, వారి స్త్రీలహృదయవికాసమునకై యుపయోగపడు ఈ పశువైద్యచింతా మణిని తుద కిప్పటికైనను మన చౌదరిగారు ఈ రూపముగా నిచ్చినందులకు సంతసము.

ప్రొఫెసర్, జి. రంగనాయకులు,
బి. లిట్. (ఆక్సుఫర్డు), యం. యల్. ఎ.

---

శ్రీరాములుచౌదరిగారు ఆదర్శప్రాయమగు వైద్యశాలను స్థాపించి స్వయముగ నెల్లరకు దగు అనుభవముల విశదపఱచి ఆంధ్రదేశమున కాద ర్శకు డాయె ననుటలో నతిశయోక్తి లేదు.

కల్లూరి చంద్రమౌళి,
బి. యస్, సి. (వ్యవ), బర్డ్స్, యం. యల్. ఏ.

---

శ్రీకృష్ణాజిల్లాబోర్డువారు యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థకు రు 500-0-0 విరాళ మొసంగుట చాలసంతోషమైన విషయము. ఈవిరాళము ప్రతిసంవత్సరము నొసంగబడునని నేను తలంచెదను. గవర్నమెంటువారు యిటువంటి సంస్థలకు యెల్లకాలము కొంత ధనసహాయమును చేయుట చాలసమంజసము. ఈసంస్థ జయప్రదముగా సాగుచుండుగాక.

పి. వి. నారాయణ,

డెలిగేటు ప్రెసిడెంటు, కృష్ణాజిల్లాబోర్డు.

---

రైతాభ్యుదయముకొరకు స్థాపించిన పశుచికిత్సాలయమును గూర్చియు వారినిర్మలత్వమును, నిష్పాక్షికత్వమును గూర్చియు వచించుటకు, గుణగ్రహణము చేయుటకు నెంతయు ఆనందించుచున్నాను. వీరు నడుపుచున్న పశువైద్యశాల కడుశుభ్రముగ నున్నది. మందులకొదువయుండదు. వారి వైద్యశాల రిజస్టరు వారికున్న పలుకుబడిని, ప్రతిదినము వ్యాధినివారణార్థము వచ్చు పశువులసంఖ్యను, స్పష్టముగా సూచించుచున్నది.

వర్జూర్ ఆశేషమ్,

జిల్లా ఆరోగ్య శాఖాధికారి.

---

ఆయుర్వేదశాస్త్రపద్ధతిని శ్రీ చౌదరిగారు పశువులకు చేయుచున్న సేవ ప్రశంసనీయము. ప్రభుత్వమువారును స్థానికసంస్థలును సర్వవిధముల సహాయపడి యీఉద్యమమును ప్రోత్సహించుట ఆవసరము. అందుకు ఈచికిత్సాలయము అర్హతపొందినది. సర్వేశ్వరుడున్ను ఆశీర్వదించుగాక.

తుర్లపాటి వెంకటేశ్వరరావు,

బారిష్టర్, జిల్లాబోర్డుమెంబరు.

వి. కనకబాపయ్య,

అడ్వకేటు.

వి. రామకోటయ్య,

బి. ఎ., బి. యల్.

---

## లింగం వీరభద్రియ్యగారు, బి. ఏ. (ఆక్సుఫర్డు) బ్యారిష్టర్.

మనదేశము వ్యవసాయముమీద చాలవర కాధారపడియున్నది. రైతులకు పశువులుమూలము. కొన్ని సంవత్సరములనుండి వ్యవసాయమున కాధారభూతమైన పశువులను తగినట్లుగ పోషించుటయు జరుగుటలేదు. శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు పశువుల సంరక్షణకు తగిన విద్యను సంపాదించి పుస్తకములరూపముననుతమ వైద్యశాల మూలమునను రైతులను సాయపడుచుండుట మిక్కిలి ప్రశంసాపాత్రము. రైతుబిడ్డలగు వీరు రైతునకు ప్రాణాధారమువంటి పశువుల సంరక్షణకు పూనుకొనుట మిక్కిలి సమంజసము. వీరి పరిశ్రమ అభివృద్ధిలోనికి వచ్చుగాకయని ఆశపడుచున్నాను.

---

## యస్. నరసింహారావుపంతులుగారు, డిప్యూటి యిన్స్పెక్టరు, గుడివాడ రేంజి.

నేను శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారి ఆయుర్వేద పశువైద్యశాలను, వారిచే రచియింపబడిన పలు పశువైద్యగ్రంథములను చూచితిని. వీరు అనుభవ వైద్యముచేతనే యింత యున్నతదశకు రాగలిగిరి. వీరు చేయుపని, కృషి, సేవ యెంతయు నుపయోగార్థమైనవి. ప్రశంసార్హము. వీరికృషి నిర్విఘ్నముగా జయప్రదముగా ఫలించుగాకయని నమ్ముచున్నాను.

---

శ్రీ శ్రీ రాజా యం. వి. అప్పారావుబహద్దరు ఉయ్యూరు జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ రాజా శివరామప్రసాద్ బహద్దర్ చల్లపల్లి జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ అప్పారావు బహద్దరు గొల్లపల్లి జమీందారుగారును

ఈవిధముగా తెలిపిరి.

మేమున్ను తదితర పెద్దమనుష్యులును కలిసి యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థను పరిశీలించితిమి. డాక్టరు శ్రీరాములుగారి ప్రయత్న మెంతయు పొగడదగియున్నది. డాక్టరుగారు మిగుల శేముషీ ధురంధరులు. వీరు నిజముగ నీ విషయమునందు జయము పొందుదురని మా యాశయము.

---

యం. నరసింహారావుగారు, కృష్ణాజిల్లాబోర్డు ఎడ్యుకేషనల్ ప్రెసిడెంటు, జిల్లాబోర్డు మెంబరు.

డాక్టరు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారిచే స్థాపింపబడి పోషింపబడుచున్న పశుచికిత్సాలయమును సందర్శించితిని. ఈ సంస్థతరఫున శ్రీరాములుగారిచే ప్రచురింపబడు గ్రంథములు కృషీవలుల కెంతో యుపయుక్తమైయున్నవి. డాక్టరుగారి సహజమగు బుద్ధికుశలతయును, స్వానుభవమును వారిని మిగుల జనసమ్మతునిగా నొనరించినవి. జిల్లాతాలూకాబోర్డుల సహాయమునను జనాదరణమునను వారి పశుచికిత్సాలయ సంస్థయభివృద్ధిలోనికి రాగలదు.

---

శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు "అనుభవ పశు చింతామణి" యను గ్రంథమును రచించి వైద్యవాఙ్మయమునకే ఆంధ్రదేశములోని రయితు సముదాయమున కత్యంతమగు మేలొనగ కలకాలము ప్రేమపూరితమైన కృతజ్ఞతా పాశములతో రయితువర్గమును గట్టివైచుకొనిరి. అనుభవమువలన సంపాదించిన జ్ఞానమును వారు కొంత కాలముగ వార్తాపత్రికల మూలమునను, ఇంతకుపూర్వమే వెలువడిన కొన్ని గ్రంథముల మూలమునను బ్రచురపరచిరి. పశుచికిత్సయందు వీరి కెంత యభిలాషకలదో, రయితుల కా జ్ఞానమును బోధించుటయను, అంత యుత్సాహము కల దనుటకు ఈ గ్రంథరచనప్రచురణములవలన గల్గిన శాశ్వతోపయోగమే తార్కాణము. గ్రంథముయొక్క ప్రాశస్త్యము, ఉపయోగము పరికించినంతటనే విదితమగును.

అచ్చటచ్చట గ్రామవాసులలో నుండిన పశు చికిత్సకులు పూర్వాచారములవలన గలిగిన మౌఢ్యమ ... స్వకీయానుభవ విజ్ఞానమును లోకమున కుపయు క్తమగురూపమున శాశ్వత మొనర్పక ఆత్మకుటుంబపోషణమే పరమార్థముగా నెంచి, అర్థసంగ్రహణమే విజ్ఞానసంపాదనమునకు పర్యవసానమని తలంచి, తద్విజ్ఞానమును గుప్తపఱచి మరణించుటచే, అనేక చికిత్సకుల యనుభవలాభము భరతఖండమునకు మఱుగైపోయెను. అట్టి యనుభవమును గ్రంథస్థ మొనర్చుటకు వలయు భాషాపరిచయాభావమువలన కొందఱిజ్ఞానము నిరుపయోగమై శైథిల్యమునుబొందెను.

మన దేశమున పశుగణ మెక్కుడుగా గలదు. రయితులసంఖ్యయు చాల గలదు. ఒక చికిత్సకుని స్వయముగ బోషింపగల పశుగణమును పెంచెడి పెద్దరయితు లెవ్వరును గానరారు. ఒకటి రెండెద్దులను గలిగిన రయితుల సంఖ్యయే యెక్కువగా గలదు. అట్టివారు తమ పశువులకు ధర్మ చికిత్స చేయించుకొన గలవారలేగాని ద్రవ్యమొసంగి వైద్యుని పోషణము నకు దోడ్పడువా రరుదు. విపరీతమైన వెలలకు పశువులను కొనుటకు వాడుకపడినట్లు, కొన్నిరూకలిచ్చి వానికి చికిత్స చేయించుకొనుట కింకను రయితులు చక్కగనలవాటు పడలేదు. అదియునుగాక ప్రభుత్వమువారిచే నియమింపబడిన "వెటరనరీ" వైద్యుల సంఖ్య మిక్కిలి కొంచెముగా

నుండుటచే వారి వలన నుపయోగము రయితుల కందరికిని అందుబాటులో లేదు. ఉన్నచోటులందును అట్టి వైద్యమునకు ప్రోత్సాహము కలుగ కున్నది. "వెటరినరీ" వైద్యము కేవలము హైందవపద్ధతికి విరోధమయిన దనియు, అందువలన నిరుపయోగ మయినదనియు ననేకులకు భ్రమ యింకను గలదు.

ఈ పరిస్థితులను చక్కబఱచుటకు గాబోలు ఆంధ్రరయితు లెక్కువగా లాభపడుటకో యన శ్రీరాములు చౌదరిగారిని శ్రీరామచంద్రుడీ గ్రంథరచనకు బ్రోత్సాహపరచెను. ఈ గ్రంథము యొక్క యుపయోగము త్వరలో నాంధ్రదేశమునకు ఆంధ్రరయితునకు వ్యక్తపడుననుట నిస్సందేహము. ఇయ్యది ప్రతి రయితువద్ద నుండతగినది. ప్రతి గ్రామపాఠశాల పుస్తక భాండాగారములోనుండి స్థానికసంఘములు రయితుసంఘమునకు దోడ్పడుట యవసరము. ప్రతి గ్రామోద్యోగ కార్యస్థానమునందు చౌదరిగారి గ్రంథముల నుంచి రయితులు కోరినప్పుడు చదువుకొనుట కను వేర్పరచినచో ప్రభుత్వమువారును రయితుల కృతజ్ఞతకు బాత్రు లయ్యెదరు.

ప్రతి ధర్మాయుర్వేద వైద్యశాలకును స్థానికసంఘము లీ గ్రంథములను సరఫరాచేయుట యుచితము. చౌదరిగారిప్రయత్నమునకు ఫలము రయితు లందరకు ఈ గ్రంథము అందుబాటులో నుండుటయే. వారి గ్రంథములను గల గ్రామ గ్రంథాలయములు రయితులకు మఱింత యుపయోగకారులుగ నుండగలవు.

శ్రీయుత శ్రీరాములుచౌదరిగారికి ఆయురారోగ్యములను దైవము ప్రసాదించి యింక నిట్టి యనుభవచికిత్స గ్రంథములను రచించుటకు ధీసంపదలను గల్గించి దీవించుగాత.

మదాసు. } బెజవాడ రామచంద్రారెడ్డి, బి. ఏ.,
యక్సు ప్రెసిడెంటు, మదాసు లెజిస్లేటివ్ కౌన్సిలరు

## శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ జమీందారుగారు, యం. యల్. ఏ., చల్లపల్లి రాజావారు, కృష్ణాజిల్లాబోర్డు ప్రెసిడెంటు.

### పశుసంరక్షణ.

పశుసంతతిని రక్షించుట సాధారణమైన పనిగాదు పసిబిడ్డలవలెనే నోరులేని పశువులకష్టములనుగూడ వేయికండ్లతో విచారించి కాపాడుకొనవలయును. దానిలో ప్రభుత్వమున కెంతయో బాధ్యతకలదు. ప్రభుత్వమువారుగూడ పశువైద్యాలయములను స్థాపించి రైతులకు సాహాయ్యము చేయుచున్నారు. కాని ఆ వైద్యసహాయ్యము చాలక రైతులు పల్లెటూళ్ళలో చేయబడుచున్న రాక్షసవైద్యముతో తృప్తిపడుచున్నారు. ఈ పద్ధతిని మాన్పించి మానవులవలెనే పశువులనుగూడ సక్రమవైద్యమున సంరక్షించుట ప్రభుత్వమునకును, ప్రజలకును ధర్మమై యున్నది.

### శ్రీరాములుచౌదరిగారి కృషి.

ఈ సత్కార్యమునకు శ్రీయుతులు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు ముందంజ వేయుట మెచ్చుకొనదగియున్నది. పశువైద్యము వంశపరంపరగా వారికి వచ్చినధనము. వ్యక్తిగతముగా చేయుచున్న వైద్యసాహాయ్యమే గాక ప్రత్యేకముగా నీ వైద్యశాలను స్థాపించి తద్వారా వారు కావించిన సేవ అపారము. ఈచికిత్సాలయ ప్రయోజనముల గమనించియే కృష్ణాజిల్లాబోర్డువారు దీనికి కొంతగ్రాంటును మంజూరు చేసియుండిరి. ఈవైద్యాలయము ప్రారంభింపబడినది మొదలు నేటివరకు జరిపిన సేవను పెక్కురు శాస్త్రవేత్తలు, ప్రభుత్వోద్యోగులు మెచ్చుకొనియున్నారు. ఇచట ఆయుర్వేద చికిత్సయేగాక ఆంగ్లేయవైద్యమును, శస్త్రచికిత్సయు గూడ చేయబడుట గమనింపతగియున్నది. అందువలన రైతులందరు నీవైద్యాలయమును శ్రద్ధగా పోషించుకొనవలయును. మరియును ఇట్టి వైద్యాలయములు ఫిర్కా కొకటిచొప్పున, అధమపక్షము

తాలూకా కొక్కటివంతునైనను స్థాపించుకొని దానివలన తమ పశుగణమును రక్షించుకొనవలయును.

సాహసము మాత్రము సాహాయ్యముగా ప్రారంభింపబడి నేడొక యమోఘ సంస్థగా తయారయిన యీ అయుర్వేద పశుచికిత్సాలయము ప్రజాప్రభుత్వముల ఆదరణమును బడసి ఇంతకంటెను మహత్తరముగా రైతు సేవ చేయగలదని ఆశించుచూ విరమించుచున్నాను.

---

శ్రీ యేజెళ్ళ శ్రీరాములుగారు చేయుచున్న పనిని, వారికళాశాలను చూచి అమితానందము పొందిని. ఏవైద్యకళాశాలలోనూ చదువక పెద్దగ్రంథములను చదువుటకు కావలసినంత సామాన్యవిద్యను పాఠశాలలో చదు ~ స్వయంకృషివలన యింతవిద్యను గడించుట సామాన్యమైన పనిగాదు. విద్యను సంపాదించుటయేగాక దానిని మరలపల్లెలలో విశేష విద్యావంతులుగాని యువకులను చేరదీసి తమవలెనే వారినిగూడ తయారుచేయనెంచుట స్తోత్రార్హమైనపని. అందులోను నోరులేని పశువులకు సేవచేయనెంచుటకంటె వుత్తమమైన కార్యము మరొకటిలేదని నాయుద్దేశము. ారి జీవితమునుండి వారుచేయుచున్న పనినుండి సామాన్యజనులు గుణపాఠమును నేర్చుకొనుటయేగాక ప్రభుత్వముగూడ విద్యావిధానమును యారు చేయుటలోకూడ వీరినుండి నేర్చుకొనవలసినది చాలయున్నదని క్కి చెప్పవచ్చును. ఈశ్వరుడు వారికృషికి సర్వవిధముల తోడ్పడుగాక ని కోరెదను.

తల్లాప్రగడ నరసింహాశర్మ,
ఆనంద నికేతనం, చాగల్లు ఆశ్రమము, ప. గోదావరిజిల్లా.

---

శ్రీయుత యేడెళ్ళ శ్రీరాములుగారిచే నడుపబడుచున్న విద్యాలయ
మును చూచితిని. వీ రీపాఠశాలను నాల్గు సంవత్సరములనుండి నడుపు
చుండిరి వీరి విద్యార్థులు పలుతావుల వైద్యాలయముల స్థాపించి ప్రశంశ
నీయముగ పశుచికిత్సలు చేయుచుండిరి. పశుపోషణనుగూర్చి, ఉపన్యాస
ములతో మాత్రం ప్రొద్దుపుచ్చుచు తగినంతగ పశువైద్యసహాయమును
ప్రభుత్వమువారు చేయుటలేదను సంగతులు నిర్వివాదమైనది. అట్టి
లోటును పూర్తిచేయుటకు శ్రీ చౌదరిగారు ప్రయత్నించుచున్నందుకు
నేను వారిని ప్రశంసించుచున్నాను. యీ విద్యాలయమున శిక్షణము
చెందిన విద్యార్థులచే వైద్యాలయముల నేర్పాటుచేసి తగిన ప్రోత్సాహ
మును చేయ ఆంధ్రులను హెచ్చరించుచున్నాను.

గొట్టిపాటి బ్రహ్మయ్య,
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి

---

శ్రీయుత యేడెళ్ల శ్రీరాములుగారిచే నడుపబడుచుండిన ఆయుర్వే
వెటరినరీ డిస్పెన్సరీని గాంచి ముదంబందితిని. అనేక పశురోగములన
కుదుర్చుచు శ్రీరాములుచౌదరిగారు ఖ్యాతివహించి యుండిరి. వీరు ప
వులపాలిట దైవమని చెప్పవచ్చును. వీరు పశువ్యాధులను గూర్చియు
వాటినినివారణ మార్గములను గూర్చియు, పత్రికలకు వ్యాసము
వ్రాయుచు, తద్వారా పశుచికిత్సామార్గములను లోకులకు వెల్లడిచేయు
దేశోపకారులగుచున్నారు. యీ వైద్యము తమలోనే యంత మొందకుం
దేశమున విరివిగ వ్యాపించులాగున పాఠశాల నొకదానిని సాగించుచ
విద్యార్థులనుగూడ నీ విద్యయందు తయారుచేయుచు, నీ వైద్యమును న
దెసల వ్యాపింపజేయు తలంపుగలిగి చక్కని కృషి చేయుచున్నారు. పైగ
ని వైద్యమును గురించి పెక్కు గ్రంథముల రచించియుండిరి. వీరి యుద
మములన్నిటికి జయమును గోరుచు, జయమొందంగ భగవంతుని ప్రార్థించ
చున్నాను.

కోడాలి శివరామకృష్ణారావు,
ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడ

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B147 |
| పుస్తకం పేరు | పశుచికిత్సాసారము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | III,62 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |